# ఆంధ్ర మహా భారతము

## ఆరణ్య పర్వము
( పంచమాశ్వాసము )

# ఘోష యాత్ర

(సవ్యాఖ్యానము)

పండిత ప్రణీతము

—: పబ్లిషర్స్ :—

మాధవి బుక్ సెంటర్
Opp : ఆర్యసమాజ్ మందిర్
సుల్తాన్ బజార్—హైదరాబాదు - 27.

వ. పాండవు లిప్పుడు పరమదుఃఖార్తులగుచు ద్వైతవన సరో
వర సమీపంబున నున్నవారని వింటిమి; నీవు సకల
సామ్రాజ్య విభవంబు మెఱసి చని యందు నీ తేజంబు
ఘర్మ సమయంబు నాఁటి తపను తేజంబై పగతుర
కన్నులు గదుర నతి దుస్సహంబగునట్లుగాఁ జేయుము;
దొల్లి నహుష పుత్రుండయిన యయాతియుం బోలె
నుజ్జ్వలుండవై యున్న నిన్నుం జూచి పాండవులు
హృదయభేదంబుగా వగచెదరు. మిత్రజన మోదంబును
శత్రుజన ఖేదంబునుం గదా సంపదలకుం దగియెడు
ఫలంబు. 4

క. ధనధాన్య పుత్ర బాంధవ
జనలాభంబులును దలఁప సరిగావు సుఖం
బునఁ దాను దనరి శత్రులు
ఘనతర దుఃఖముల నుండఁ గని యలరుటకున్. 5

ఉ. నారలు గట్టి కూర లశనంబుగ నుగ్రవనంబులో విప
ద్భారమునొంది వందురిన ఫల్గును నుజ్జ్వల రాజ్య వైభవో
దారులమై కనుంగొని ముదంబున బొందఁగఁ గాంచు
కంటె నిం
పారఁగ నొందు గల్గునె కృతార్థత? యెందును
గౌరవేశ్వరా! 6

తే. అతుల సౌభాగ్య పుణ్యసమగ్రగరిమ
నొప్పుచున్న నీ దేవుల యొప్పుసూచి,
ధృతి దఱఁగి తన్నుఁదాన నిందించు కొనుచు
హృదయమునఁ బాండవాంగన యెరియవలదె? 7

వ. అనిన నిది వోలు నని నాగకేతనుండు సంప్రీతుండై
కొండొక విచారించి రాధేయుం జూచి యిట్లనియె. 8

క. "నా తలఁపును నిట్టిద; నీ,
వే తెఱఁ గెఱిఁగించి తది యభీష్టము; మన మా
ద్వైత వనంబున కరుగుట
భూతలపతి యనుమతింపఁ బోలదు మదిలోన్. 9

తే. అందుఁ బాండవు లుండుట యాంబికేయుఁ
డెఱుఁగు; మన మవ్వనంబున కేఁగుటయును
గడఁగి పార్థులతోడి విగ్రహము కొఱక
యని యవశ్యంబు వారించు నతఁడు మనల. 10

వ. అదియునుం గాక. 11

చ. ఉరుతర విక్రమాఢ్యు లనియున్ మహనీయ తపోవిశేష సు
స్థిరు లనియుం బృథాసుతుల దిక్కునఁ దద్దయు భీతుఁడై నిరం
తరమును మానవేంద్రుఁ డెదఁ దాపమునొందుచు నుండు; వింటె యి
క్కురు విభుఁ డింతసేపుఁ గడుఁ గూర్చి విలాపము సేసె వారికిన్. 12

వ. అతని యొద్దనుండి విదురుండు వారిన పోటు మానిసులుగాఁ
బొగడుచుండు; జూదంబునాఁట నుండియు విదురుండు
పాండవ పక్షపాతి యగుట దెల్లంబయ్యె; మన విచారించిన
యిక్కార్యంబు చిన్నసన్న యెఱింగెనేనియు నాతం డెల్ల
భంగుల విఘ్నంబుసేయుం గావున నిదియంతయు రహస్యం

బుగా నొనరించికొని ధృతరాష్ట్రుండు దీని కనుమతించు
తెఱం గెయ్యది యట్టి యుపాయంబు నీవును శకునియు
నూహించునది; మనము రేపకడవచ్చి కురు పితామహుం
డైన భీష్మునిఁ గురువంశోత్తముం డైన ధృతరాష్ట్రుని
నొడంబఱిచి వెడలుద మని వారి వీడ్కొలిపి దుర్యోధనుం
డభ్యంతర గృహంబున కరిగి యారాత్రి సముచిత ప్రకా
రంబునఁ గడపెఁ బ్రభాతంబగుటయుఁ గర్ణుండు దుర్యోధను
కడకుం జని యిట్లనియె. 13

ఉ. "భూతలనాథ! యే నొకటి పోల నుపాయము గంటి; విప్పు డా
ద్వైతవనంబు నందు విదితంబుగ నున్నవి గోకదంబముల్;
ప్రీతిగఁ దద్విలోకనము పేరఁ జనం దగు; ధారుణీశ్వరుం
డీ తెఱఁగైనఁ బొమ్మను; నభీష్టము నేకుఱు నెల్ల భంగు
లన్." 14

క. నా విని సుబల తనూజుఁడు,
"దేవా! నీయాన! యేను దెల్లంబుగ రే
యీ వెరవె నెమ్మనమ్మున,
భావించితి" ననియె; నంతఁ బ్రహసిత ముఖులై . 15

వ. ఒండొరుల చెయి సఱచి నవ్వుచు నమ్మువ్వురుం దక్షిణంబ
సమంగ నామధేయుం డయిన గోపాలకు నొక్కనిం గఱపి
కొని ధృతరాష్ట్రు పాలికిం జని సముచిత ప్రసంగ సేవావిశే
షంబుల నమ్మహీవిభు సుముఖుం జేసి యనంతరంబ "దేవా!
ద్వైతవనంబునందుల కీలారంబుననుండి వీఁడె యొక్క గోప
కుండు వచ్చె" ననిన నతండును వాని కభిముఖుండై పసుల
నేమం బడుగుటయు వాఁ డిట్లనియె. 16

ఉ. "ద్వైతవనంబు నట్టిసుఖవాసము గోవులకెందులేదు; ధా
త్రీతల నాథ! యిప్పుడు ప్రదీప్తములై సతతంబుఁ బేర్చి గో
వ్రాత భయంకరంబు లగు వాలుమృగంబులు సంచరించు; మీ
కాతెఱఁ గెల్లఁ జెప్పుటకునై యిట వచ్చితి నేను జెచ్చెరన్." 17

వ. అనిన యనంతరంబ కర్ణసౌబలులు ధృతరాష్ట్రుతోడ "దేవా!
యట్లయినం దడయక దుష్టమృగ నాశనంబును గోగణ
సంరక్షణంబును జేయుటకు భవత్సూను దుర్యోధను నియో
గింపు మ"నిన నతండు గొండొక విచారించి యిట్లనియె. 18

మ. "తగు గోరక్ష యొనర్ప; దుష్టమృగ విధ్వంసంబు నూహింప
మే
లగు; నైనన్ వినుఁ దద్వనాంతరమునం దాసక్తిమై
నున్నవా
రు గరిష్ఠాత్ములు పాండురాజతనయుల్ రూఢవ్రతాపాఢ్యు; ల
ట్లగుటన్ మీగమనంబు నామదిఁ బ్రియంబై తోఁప దెబ్బం
గులన్. 19

క. మున్నును మీచేతఁ గడున్,
ఖిన్నము వడి నొచ్చినారు పార్థులు; మిమ్ముం
గన్నంత నలుగ కుందురె,
పన్నగరిపు సన్నిభుండు పవనజుఁ డాత్మన్. 20

వ. అదియునుం గాక,

చ. ఒకరుఁడ ధాత్రి యంతయును నోర్చెఁ గృతాస్త్రుఁడు గాక యుండియుం
ప్రకటిత బాహు విక్రముడు ఫల్గునుఁ; డిష్ట మహేంద్రు పాల న
త్యకుటిల దివ్యబాణ విదుఁడై యెలమిం జనుదెంచె; నట్టి వా
నికి నెదురంగ శక్య మగునే రణభూముల నింక నేరికిన్? 22

తే. చెనకి మీరు వారికిఁ గీడు సేయుటయును,
వారు మీ కెగ్గుసేఁతయు వగవ మేలు
గాదు; వలసిన ఘోష రక్షణ మొనర్పఁ,
దగిన వారలఁ బుత్తము దడయ కందు." 23

వ. అని యొడంబడ కున్న నయ్యాంబికేయునకు శకుని యిట్లని యె. 24

ఉ. "పాలిత విక్రమోన్నతులు పాండుతనూజులు; వారి కప్రియం
బేల యొనర్తుమే? మధిప యే మటు సేసితి మేనియుం బ్రతి
జ్ఞాలపితుండు ధర్మజుఁడు సత్యము దప్పునె? తమ్ము లేల త
చ్ఛీల మతిక్రమింతు? రిది సిద్ధమునమ్ముము నెమ్మనంబునన్. 25

క. మాకుసు జిత్తంబుల మృగ,
యా కౌతుక మతిశయిల్లినది; గోగణ ర
క్షా కరణము గార్యం బగు,
యే కీడును నేల పొందు? నిందు మహీశా." 26

క. అనిన నతఁడు గొండొకవడి,
మనమున నూహించి "బుద్ధిమంతులరై గో

ధనము నరసి తడయక రం,"
డని వారికి నెట్టకేల కనుమతి యిచ్చెన్. 27

ఆ. ఆ క్షణంబ కౌతుకాతిశయ వ్యగ్ర,
హృదయుఁడైన ఫణధరేంద్ర కేతు
నాజ్ఞఁ గరిపురంబునం దెల్ల ఘోషింపఁ,
బడియె ఘోషయాత్ర ప్రకటలీల. 28

సీ. అంతఁ బ్రహృష్టాత్ముఁడై లలితాంబరా
భరణాంగ రాగ విస్ఫురిత మూర్తి
నొప్పారి విభుఁడు సహోదరులును గర్ణ
గాంధారులును బ్రియ బాంధవులును
సముచిత వాహన సైన్యసమేతులై
కొలువంగ వెడలె నుజ్జ్వలవిభూతి,
నాందోళికాది వాహనములఁ దత్ప్రియ
ప్రమదలు బహుసహస్రములు సనిరి;

ఆ. కడఁగి పౌరులెల్లఁగై సేసి పడఁతులుఁ,
దారు నడచి రతి ముదంబు తోడఁ;
బ్రకట శకట వైశ్య పణ్యాంగనాది సం,
కులము నుల్లసిల్లె ఘోషయాత్ర. 29

వ. మఱియు నమ్మహీపతి పయనంబున కనురూపంబుగా నెని మిది వేలు రథంబులు, ముప్పదివే లేనుంగులుఁ, దొంబది వేలు గుఱ్ఱంబులు, శతసహస్ర సంఖ్య కాల్బలంబు గల మహా సైన్యంబుతోడ నడిచె; మృగయాకుశలులైన మృగయులు, విటవిదూషకవంది వైతాళికాది జనులనేకులనుగమించి, రిట్లు గవ్యూతిమాత్రం బగునేల యరిగి యచ్చట విడిసి యద్దిన

శేషంబును రాత్రియుం గడపి మఱునాఁడు వివిధ గిరిగహ
నంబు లతిక్రమించి ఘోషంబు లున్న వనంబు సొచ్చి యం
దొక్క రమణీయ ప్రదేశంబును శిబిరంబు గావించి యమ్మ
నుజేంద్రుఁడు. 30

సీ. నానా సహస్ర సంఖ్యానంబులై సంత
తానంద విగత భయత్వలీల
నక్కాననమున నేదిక్కు సూచిన నతి
సంకులంబుగఁగుంద శంఖ చంద్ర
హార నీహార డిండీర పటీర ము
క్తాహార హీర సంకాశములును
గాదంబ కాలేయ కాదంబినీ నీల
జాల తమాలికా సన్నిభములు

తే. ప్రౌఢ బంధూక పల్లవ భాసితములు,
వికచ కాంచన చంపక విస్ఫుటములు
నైన వర్ణంబు లొప్ప నేత్రాభిరామ,
భంగి నలలారు గో కదంబములఁ గనియె. 31

క. గోపాల సమన్వితుఁడై,
యా పొలమునఁ దిరిగి గోరసాస్వాదన లీ
లా పరితృప్తిఁ దలిర్చె మ,
హీపాలుఁడు నెమ్మితోడ నిష్టులుఁ దానున్. 32

వ. తదనంతరంబ గాయక నర్తకాదులు వందిమాగధ జనం
బులుం గనిన నాదరించి వారికి నభిమత ధనంబు లొసంగి
మృగయా వినోదంబునకుం దొడంగి. 33

మ. హరిణవ్రాతములం గలంచుచు, నుదగ్రానేకపశ్రేణిఁ జె
చ్చెర బంధించుచు, నుగ్రసింహ నివహచ్ఛేద్దైకసంక్రీడ బం
ధురతం బేర్చుచుఁ, బ్రస్ఫురన్మహిష శార్దూలోద్ధతక్రోడ ని
ర్భర పాతంబు లొనర్చుచుం దిరిగె భూపశ్రేష్ఠుఁ డక్కాన
లోన్. 34

వ. మఱియు ననవరత సురభి సరసీరుహ ప్రకర పరికీర్ణంబు
లగు జలాశయంబు లాలోకించుచు నతిమనోహర ప్రసూన
ఫల భరిత పాదప వనాభ్యంతరంబుల విహరించుచు నున్మద
మయూర మధుకర కీరకోకిలాలాప కోలాహలంబు లాక
ర్ణించుచుఁ గ్రమంబునం బరిజన సమన్వితుండై ధార్తరా
ష్ట్రుండు ద్వైతవన సరోవరంబు నేరం జనియె; నంత నట
ధర్మనందనుండు తత్సమీపంబున మునిజన సహాయుండై
వన్యంబులగు ఫలమూల విశేషంబులు సాధనంబులుగా సద్య
స్కందం బను యజ్ఞంబు సేయుచుండె నప్పుడు దుర్యోధ
నుండు నిజ భృత్య జనుల నక్కొలని దరిం గ్రీడా గృహం
బులు నిర్మింప నియోగించిన. 35

క. వారును సంభ్రమమున న,
వ్వారిరుహాకరము పొంత వదలక క్రీడా
గారములు గట్టఁ దొడఁగుడు,
వారించుచుఁ బాఱుతెంచి వడి గంధర్వుల్. 36

వ. "ఇది చిత్రసేనుండను గంధర్వపతికిం గ్రీడార్థంబు కల్పితం
బైనది గావున మీరిక్కొలను నేరక తొలంగి పోవునది"
యనిన వారు మగుడం జని దుర్యోధనునకుఁ జెప్పుటయు
నతండు రణదుర్మదులైన సైనికులం గొందఱం బంచిన
నరిగి వారలు గంధర్వుల కిట్లనిరి. 37

మ. "బలియుం డా ధృతరాష్ట్రసూనుఁడు మహాబాహుండు దుర్యో
ధనుం
డలఘుం డీకమలాకరంబునకుఁ గ్రీడార్థంబు గౌతూహలం
బెలయంగాఁ బ్రియకామినీ సహితుఁడై యేతెంచుచున్నాడు; మీ
ర్వల దిం దుండఁ, దొలంగి పొం"డనవుడున్ వారుద్ధత
క్రోధులై. 38

వ. ఒండొరువుల మొగంబులు సూచి పెలుచ నవ్వి వారల కి
ట్లనిరి. 39

క. "ఎదిరిం దన్ను నెఱుంగఁడు,
మదమునఁ బ్రాణంబుఁ దనదు మానముఁ గోల్పో
మదిఁ దలచినాఁడు మీ నృపుఁ,
డిది యేటికిఁ జెనఁటి చెయ్వులిన్నియు నిచటన్. 40

వ. బుద్ధిమంతుఁడై యూరక చనుట లెస్స యనుం"డనినం
గ్రమ్మఱి చని వారు కురుపతికిం దద్వచనంబుల తెఱం
గంతయుం జెప్పుటయు, నతండు రోషావేశ వివశుండై
తమ్ముల దొరలంజూచి "మీ రిందఱు మీమీ సైన్యంబు
తోడం గూడి కడంగి దుర్వినీతులైన గంధర్వుల గర్వంబు
మాన్పి సరోవరం బాక్రమించునది; వారికి సహాయుం డయి
సురగణ సమేతంబుగ నింద్రుండు సనుదెంచెనేనియు నవలీల
జయించునది"యని నియోగించిన. 41

క. అతుల చతురంగ సేనా
న్వితు లయి ధృతరాష్ట్ర సుతులు నిరతిశయ రయో
ద్ధతి సింహనాద బధిరీ,
కృత దిఙ్ముఖు లగుచుఁ జనిరి గినుక యెలర్పన్. 42

వ. ఇట్లు సనుదెంచు కురువీరుల కడ్డంబు వచ్చి కొందఱు గంధర్వులు ప్రియపూర్వకంబుగా "నిట యేల వచ్చెదరు? మీకు మాతోడి విద్వేషం బేటికి? నిలువుం"డనినం బెలుచనార్చి సేనాగ్రచరులు వారల మీఁదం బ్రచుర శస్త్రాస్త్ర పాతంబు సేయం దొడంగినం దొలంగి చని యా గంధర్వు లాక్షణంబ చిత్రసేనునకు నంతయుఁ జెప్పి పుచ్చినం బ్రబల రోష రంజితాననుండై యతండు. 43

క. "చనుఁడు రయంబున; నా దు,
ర్జనులం గౌరవులఁ బొదివి సమయింపుఁడు మీ"
రని బహుసహస్ర సంఖ్యలఁ,
బనిచెను గంధర్వవరులఁ బ్రకటిత బలులన్. 44

వ. ఇట్లు వనిచిన. 45

ఉ. ఆయత కుంత కార్ముక గదాసి పరశ్వథ శూల పట్టి సా
ద్యాయుధ ఘోరహస్తులు గులాచల తుంగతనుల్ ప్రచండ తే
జోయుతు లావి యచ్చరులు శూరతమై నడతెంచి బల్విడిం
గో యని తాఁకి రుగ్రరణ కోవిదులై కురురాజ సైన్యమున్. 46

వ. ఇవ్విధంబున గంధర్వులు బెట్టిదంబుగాఁ గిట్టి నొప్పింపం దొడంగినం గలంగి దుశ్శాసనాది కౌరవులు ససైన్యంబుగాఁ దెరలి దుర్యోధను చేరువకుం బఱచినఁ గర్ణుం డొక్కరుండ సుస్థిరుం డయి నిలిచి గంధర్వుల నిలువరించి భల్లార్ధచంద్ర ప్రముఖ బహుల బాణపాతంబులం దదీయ దేహంబులు ఖండించుచు నిమిష మాత్రంబునఁ జిత్రసేను సైనిక

శతంబుల రూపుమాపుటయు మఱియుం బై పై గంధర్వులు
శతసహస్ర సంఖ్యలు తోఁతెంచినం బృథివి యెల్లను
గంధర్వమయం బైన ట్లుండెఁ నప్పుడు. 47

చ. శకునియుఁ దమ్ములుం బ్రబల సైన్యముతో నడతేర నాహవో
త్సుకమతి యై సుయోధనుఁడు సూత తనూభవుఁ డున్న చోటికిం
బ్రకట భుజోగ్రతం గడఁగి బల్విడిఁ దద్రిపు కోటిఁదాఁకినన్
సకల జగద్భయంకర లసత్సమరోత్సవమయ్యె నయ్యెడన్. 48

క. కొండొక సేపునకు మహో
ద్దండ నృపానేక ఘోరతర విశిఖ వ్యా
ఖండిత శరీరులై ధృతి
ఖండితముగఁ బల్లటిలిరి గంధర్వులనిన్. 49

క. గంధర్వులు దెరలుట విని
గంధర్వ విభుండు క్రోధ కలుషిత మతియై
గంధగజము చందమున మ
దాంధ గతిం గవిసెఁ గౌరవానీకముపై. 50

వ. ఇట్లు గవిసి చిత్రసేనుండు. 51

శా. మాయాసంగర కోవిదుండు వికసన్మాయాస్త్ర జాలంబులన్
వాయువ్యాప్తి యడంగ నర్కకిరణ వ్రాతంబు రుద్ధంబుగాఁ
జేయం జొచ్చినఁ ద్రెళ్ళెఁ దేరులు కరుల్ శీర్ణంబు లయ్యెన్ దశ

త్కాయం బయ్యె హయాలి గూలిరి ఖటుల్ గౌరవ్య సైన్యం
బునన్. 52

క. పొదలి యొకని కొక్కనికిని,
ఐదుగురు పదుగురుగఁ గవిసి పౌరవసేనం
బొదివి సమయింపఁ దొడఁగిరి,
వదలక గంధర్వు లని నవార్యోద్ధతులై.

వ. అవ్వి యచ్చరుల విక్రమంబునకు నోర్వక బెదరి చెదరి కురు
రాజ సైన్యంబు ధర్మనందనుం డున్న కందువకుఁ బాఱం
దొడంగె నప్పుడు రాధేయుం డజేయుండై కులశైలంబు
నుంబోలెఁ దలరక నిలిచి గంధర్వులు గురియు శరవర్షం
బున మునుఁగుచుఁ దన యోపినంత పెనంగు చుండె;
సోదర సౌబల సహాయుండై దుర్యోధనుండు గర్ణ సాహా
య్యంబు వదలక నిలిచె, నంత ననంత సత్త్వులైన గంధర్వు
లనేకులు సుట్టు ముట్టి. 54

ఉ. కొందఱు సూతు నశ్వములఁ గొందఱు కొందఱు చాప
దండముం
గొందఱు చక్రయుగ్మకముఁ గొందఱు విస్ఫురితాత పత్ర
ముం
గొందఱు కూబరంబు మఱికొందఱు కేతువుఁ గొంద ఱక్ష
మున్
దండడిఁ దున్మివైచి విరథత్వ మొనర్చిరి సూత సూతికిన్. 55

వ. ఇట్లు విరథుండయి కర్ణుండు వికర్ణు రథంబెక్కి రణభూమి
కిం దొలంగి చనియె; దుర్యోధనుండు విముఖుండు గాక
పరబలంబు మార్కొని పెనంగం దొడంగినం గినిసి చిత్ర

సేనుండు వానిం దలపడి తదీయ స్యందనంబు రాధేయు రథంబునట్లు భగ్నంబుగాఁ జేయించి విర ండగు నమ్మహీ విభుం గేశాకర్షణంబున నేలం బడవైచి పెడకేలు గట్టి సింహనాదంబు సేసినం దక్కిన గంధర్వులు గనుకనిం బఱచి యతని వనితాజనంబులను దత్సోదరులగు దుశ్శాసన దుర్విషహ దుర్ముఖ వివింశతి చిత్రసేన విందాను విందులను దత్తనూభవులను దదీయమంత్రులను బట్టి బంధించి చిత్ర సేనున కొప్పించిరి; రంతఁ బెఱ కౌరవులును బౌరులు నమా త్యులుం జెదరి యాక్రోశించుచుం బఱచి ధర్మపుత్రు శరణు సొచ్చి యిట్లనిరి. 56

మ. "ఘనబాహాబల దుర్నివారమహిమన్ గంధర్వ వీరుల్ సుయో
ధనుఁ దత్కాంతలఁ దత్సహోదరుల బంధప్రాప్తులంజేసి కై
కొని వే పోవుచు నున్నవా రదె; రిపు క్షోభంబు గావించి; నీ
యనుజవ్రాతముఁ గావవే కరుణ నిండారంగ రాజో
త్తమా!" 57

వ. అని కృతాంజలులై పలుకుచున్న వారిం జూచి భీమసేనుండు ప్రహసితాననుండగుచు ధర్మపుత్రున కిట్లనియె. 58

ఆ. "మనకుఁ జులుక నయ్యె మనచేయు పవియ గం,
ధర్వవరులు గూడి తగనొనర్చి
రింత లేస్సయగునె! యే భారమును లేక,
యూరకుండ మనల నొందె జయము. 59

గీ. పుట్టుఁ గల్లరియై పాపములకు నెల్ల,
దిట్ట యై లోకముల చేతఁ దిట్టువడిన

కట్టిఁడికి నిట్టి కష్టంబు గా నొనర్చి
తగ విధాతృఁడు చతురుఁడై నెగడె నేఁడు. 60

మ. విపరీతస్థితి నొంది ఘోరవిపినోర్వీవాసులై నిత్యదుః
ఖపరాధీనతఁ దూలిరంచు మనలన్ గర్వోద్ధతస్వాంతుఁడై
యపలాపింపఁగ వచ్చి దుర్ణయ పరుం డా ధార్తరాష్ట్రుండు దో
షపరీతాత్ముఁడు దత్ఫలంబు గుడిచెన్ సత్యంబు సామాత్యుఁడై. 61

వ. వాని దెసం గృప సేయ వల"దనిన ననుజునకు నగ్రజుం
డిట్లనియె. 62

క. "అకట! యిది పరుష వాక్యము,
లకు సమయమె? శరణు సొచ్చి లఘుభావముతో
వికలగతి నున్న కౌరవ,
నికరమునకుఁ గరుణ సేయ నీకుం దగదే? 63

వ. ఏకాన్వయ జాతులైన వారికి నర్థనిమిత్తం బయిన భేదం
బొక్కొక్కమాటు వర్తిల్లు; నంతనచేసి సహజ స్నేహంబు
దప్పనేరదు; జ్ఞాతి జనంబులు దమలో నెట్టివారైన నొప్పుం
గాని యన్యుల వలనం బరిభవంబు దొడరినప్పుడు దా రొం
డొరులఁ జేకొన కునికి లోకనింద్యంబు; దుర్యోధనుండు
దుర్వినీతుం డైనను సభార్యుండై పరులచేతం బట్టువడియె;
దీని నుపేక్షించిన మనకుం గులహాని యగు; నిదియునుం
గాక శరణాగత రక్షణంబు రాజమాత్రంబువాని కెల్ల
ధర్మంబు; నీయట్టి బాహుబల సంపన్నునకు నిట్టి సుక
ర్మంబు కర్తవ్యం బని వేఱ చెప్పనేల? లెమ్ము, నీవును నీ

తమ్ములు నిమ్మల రథంబు లెక్కి సర్వాయుధ సన్నద్ధులై
చని సుయోధను చెఱ దలుగుం"డనినఁ బవన నందనుండు
ధర్మనందనున కి ట్లనియె. 64

సీ. "అనుమాన మొక్కింతయును లేక యలిగి జ
లంబులఁ ద్రోచె, విషంబు పెట్టె,
గృహదాహ మొనరించె, విహిత దురోదర
కపటుఁడై రాజ్యంబు నపహరించె,
జను లెల్లఁ జూడంగ వనజాక్షిఁ బాంచాలిఁ
దల వట్టి యీడ్పించె, వలువ లొలువఁ
బనిచెఁ; బుట్టిన కోలె మనకు నక్కట సుయో
ధనుఁ డెగ్గు సేయని దినముఁ గలదె?

ఆ. వాని చేఁత లొకటి యేనియుఁ దలపవు,
నీవు, మనుజనాథ! కేవలంపుఁ
గరుణఁ పూని యుండు; దరయ నెప్పుడు నిట్టు,
లైన మనకుఁ గార్య హాని గాదె?" 65

వ. అని పూర్వవైర స్మరణ కలుషితుండై పలికిన నతనికి
నజాత శత్రుండు సాంత్వన పూర్వకంబుగా ని ట్లనియె. 66

ఆ. "కావరయ్య యనినఁ గరము దుర్బలుఁడైన,
జెనసి యోపినంతఁ జేయు ననిన
నూర కుండు నయ్య? యుత్తమ శూరుండు,
దీన జనుల యున్న తెఱఁగు నూచి? 67

క. శరణం బని వచ్చిన భీ,
కర శత్రువు నయినఁ బ్రీతిఁ గావఁగ వలయుం

గరుణా పరుల తెఱం గిది;
యిరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్. 68

వ. ధృతరాష్ట్ర సూనుండు భవదీయ బలశౌర్యంబుల పేర్మి
యెఱుంగుం గావునఁ దన్ను నవశ్యంబును విడిపింతు రని
మనదెస బద్ధాశుండై యుండు; నిది మనకుఁ బుణ్యంబును
గీర్తియుం జేకొను సమయంబు; ని న్నింత నిర్బంధింప
వలవ దేన యరుగుదు; నిప్పుడు యజ్ఞదీక్షితుండనై
యున్న వాఁడఁ గావున నాకుం జనరాదు; మీరు వేగ చని
గంధర్వులం బ్రియపూర్వకంబుగా ననునయించి సుయోధను
విడిపించునది సామవచనంబులం దీర కున్నఁ బరాక్రమం
బుననైనం బ్రతివీరుల నోర్చి కార్యంబు దీర్చునది; నాచేయు
జన్నంబు సఫలంబు సేయుం"డనిన భీముం డెట్టకేనియు
నియ్య కొనియె; నర్జునుండును ధర్మరాజు పనువు గైకొని
కురురాజు చెఱదలుగఁ బ్రతిజ్ఞ సేసె, నకుల సహదేవులు
నుత్సాహసమేతు లయి; రన్నలువురు నాముక్త కవచులు,
నాబద్ధ తూణీరులు, నాకలితకార్ముకులు నారూఢ రథులునయి
యగ్రజు వీడ్కొని యతిత్వరితగతి నడచినం గౌరవ
సైన్యంబంతయు వారిం గూడుకొని సింహనాదంబులు
సెలంగం జనియె; ని ట్లరిగి వారలు గంధ మాదనంబునకయి
చను చున్న యవ్వియచ్చ రానీకంబుం గూడ ముట్టిన. 69

క. కని గంధర్వులు గ్రమ్మఱి,
ఘనులం బాండవుల నగ్ని కల్పులఁ దేజో
ధనుల నమరేంద్ర సదృశుల,
ననఘుల మార్కొనిరి ప్రకటితాటోపమునన్. 70

ఉ. అగ్రజు వాక్యముల్ దలఁచి యర్జునుఁ డప్పుడు వారితోడ న

త్యగ్రత దక్కి యెంతయు బ్రియోక్తుల ని ట్లను "మీకు
మా యెడన్
విగ్రహ మేల? నెయ్యమున విద్వుఁడు కౌరవరాజుఁ; బార్థివ
ప్రాగ్రసరుండు ధర్మసుతు పన్పెది; మీకు నలంఘ్య
మి త్రతిన్." 71

వ. అనిన నతనికి గంధర్వు లి ట్లనిరి. 72

గీ. "ధర్మజుఁడు మాకుఁ బ్రభుఁడె? యా ధర్మతనయు
నాజ్ఞ నే మేల యొనరింతు? మనిమిషేంద్రుఁ
డొక్కరుఁడ మమ్ము శాసింప నొడయుఁ; డన్య
లెందు నెవ్వరైనను భయ మేమి మాకు?" 73

వ. అనిన వివ్వచ్ఛుం డవ్వియచ్చరుల నుపలక్షించి "మును
మున్న తెగువకుం జొరనేల? యని ప్రియంబును ధర్మం
బునుం గాఁ బలికితి; నెట్లును మీరు సామసాధ్యులరుగాకునికి
దోఁచుచున్నయది గావున నుగ్రం బయిన విగ్రహంబున
దుర్యోధను విడిపింతు"నని వారలమీఁద నిశిత విశిఖ ప్రక
రంబులు ప్రయోగించె; నా గంధర్వులు నతనిపైఁ బటు
బాణ వర్షంబులు గురిసి; రి ట్లానలువురకు ననేక గంధర్వ
శత సహస్రంబులతో నతి ఘోర సమరంబయ్యె నందు. 74

తరలము. కదిసి యర్జును తేరు భగ్నముగా నొనర్పఁ దలంచి పె
ల్లొదవి ఖేచరకోటి గ్రమ్మొటయుం బురందర నందనుం
డదయుఁడై పదిలక్షలం బ్రబళ యాగ్నికల్పుల దివ్యలం
గదనళూరుల నిర్దహించెఁ బ్రకాండ దివ్యశరార్చులన్. 75

మహాస్రగ్ధర. ఘనకోదండోగ్ర మౌర్వీక్వణ మఖిల నభోగహ్వరా
భోగ భాగం
బున నాపూర్ణంబు గా నుబ్బునఁగవలు మరుత్పుత్త్రుఁడుం
దీవ్ర నారా
చ నితాంతాపాత లీలాసరభసగతులై శత్రువీరవ్రజంబుం
దునుమం దచ్ఛోణితంబుల్ దొఱఁగి మడువులై తొట్టె
నయ్యుద్ధ భూమిన్. 76

వ. ఇట్లు కౌంతేయుల చేతం బీడితులై గంధర్వులు దుర్యోధనా
దుల జెఱ లేమఱక కొనుచు గగనంబునకు నెగసి తోఁచి
పోవ నుంకించిన నెఱింగి సవ్యసాచి రయంబున నతినిబిడ
బాణజాలంబులం జేసి దిఙ్నభోమార్గంబులు నీరంధ్రంబు
లుగాఁ గప్పిన నగ్గగనచరులు వలలోనం జిక్కిన పులుఁగు
లుంబోలెఁ బోవనేరక శరపంజరంబునం జిక్కియు నుక్కు
సెడక యన్నలువుర మీఁద వివిధాయుధ పరంపరలు ప్రయో
గించిన. 77

మ. అవి యెల్లం దునుమాడి క్రీడి ఘన రోషాభీలుఁడై శాత భ
ల్లి వితానం బడరించినం దలలు డొల్లం గాయముల్
మింటనుం
డి వడిం గుంభినిఁ గూలఁ గా రుధిరవృష్టిం గాలువల్
వాఱఁ గా
దివి గంధర్వుల క్రం దడంగె జగ ముద్వేగంబునం
బొందఁగన్. 78

వ. మఱియు నర్జున ప్రయుక్తం బయిన యాగ్నేయాస్త్రంబు
దావాగ్ని నీరస విపినంబు దహించు తెఱంగున గంధర్వ
నివహంబు నీఱు సేయం దొడంగినం గినిసి చిత్రసేనుండు

భీమసేనానుజు మీఁదం బటు గదా దండంబు వైచిన నతండు
దాని నేడు దునియలుగా నేయుటయు గంధర్వరాజు
మాయాబలంబున నంతర్హితుండై. 79

క. నలువురు పార్థుల నత్యు,
జ్జ్వల శరవర్షముల ముంచి జలధరము క్రియం
బెలుచన గర్జిల్లుచు ను,
త్కలుఁడయి తన విక్రమంబుఁ గడఁకయుఁ జూపెన్. 80

ఆ. దాని నుఱక యింద్రసూనుండు గాండీవి,
శబ్ద భేదులయిన సాయకములఁ
జిత్రసేను సర్వగాత్రంబు భేదించి,
యొక్క మాత్రలోన నుడిపెఁ గడఁక. 81

వ. ఇట్లు నొచ్చి గంధర్వనాయకుండు రణసంరంభంబు విడిచి
యర్జునుం జేరం జని తన మొగ సూపి నిలిచిన నవ్వీరుండును
నాత్మ సఖుం డయిన ఖేచరపతి తెలుంగుసూచి సంహృతా
స్త్రుండయ్యె; వృకోదరాదులును సమరవిరామంబు నొందిరి;
వార లందఱుఁ దమ తమ రథంబుల మీదన యుండి
యొండొరులఁ గుశలంబు లడిగి రప్పు డర్జునుండు చిత్ర
సేనున కిట్లనియె. 82

క. "వీరోత్తమ! నీకిమ్మెయి,
వైరము దగు నయ్య! కౌరవ ప్రకరముతోఁ
గౌరవపతి విడువుము త,
ద్దారానుజ సుతసమన్వితంబుగ నెమ్మిన్." 83

వ. అనిన నతం డర్జునున కిట్లనియె. 84

సీ. "ఈ దురాత్ముఁడు మిమ్ము నివ్వనంబున నితాం
తాయాస పీడితులైన వారిఁ
బరమ ధర్మాత్ముల భార్యాసమేతుల
నపహసింపఁ దలంచి యరుగుదెంచె;
నింతయు నెఱిఁగి సురేంద్రుండు గలుషించి
యనుజ వధూసహాయాన్వితముగఁ
బాపవర్తను వీనిఁ బట్టి తెమ్మని నన్నుఁ
బనిచిన వచ్చితిఁ బార్థ వినవె!

తే. శత్రుపాలికి నిదె కొని చనుచు నున్న,
వాఁడ; నీ వింక నొం డన వలదు, వినుము!
మత్సఖుండవు గావున మత్సరంబు,
నలుకయును లేదు నీదెస ననఘ నాకు." 85

తే. అనిన నర్జునుఁ డతని కిట్లనియె "నీ సు
యోధనుఁడు మాకు వినుము సహోదరుండు
గాన యీతని విడుచుట గర్జ; మిదియ
ధర్మజున కెంతయును బ్రమోదంబు సేఁత. 86

చ. అమర వరేణ్య పన్పయిన నావల నెయ్యది యైన నిప్డు ధ
ర్మమహితుఁడైన ధర్మజు సమక్షమునం దెఱిగించి
యాతఁ డే
క్రమమున నెద్ది సెప్పె నది గైకొని చేయుము నీవు;
మత్ప్రియా
ర్థము చనుదెమ్ము" నావుడును దాని కొడంబడి చిత్ర
సేనుఁడున్. 87

వ. వారలుం దాను ధర్మజు కడకుం జనిన నయ్యజాతశత్రుండు చిత్రసేను నతిప్రియంబునం బూజించి "మహాత్మా! యీ సుయోధనుండు సానుజామాత్యుం డయి మీచేత వధియింపం బడ కునికి మే లయ్యె; మీ కారణంబున మా వంశంబునకు నొండొక్క హాని వొంద దయ్యె; వీఁ డెట్టి యపరాధంబు సేసినను నది యంతయు సహించి మాకుంగా వీని విడువ వలయు"నని ప్రార్థించిన నతం డట్లకాక యని దుర్యోధనాదుల నందఱ విడిచి పాండుపుత్రుల నామంత్రణంబు సేసి దివంబున కరిగి తత్ప్రకారంబు సకలంబును నింద్రునకు నివేదించిన నింద్రుండును సమర నిహతులయిన గంధర్వుల నమృత వృష్టింజేసి బ్రదికించె; నిట యుధిష్ఠిరుండును ధార్తరాష్ట్రునకు బంధమోక్షణంబు గావించి వాని కిట్లనియె. 88

ఉ. ఎన్నఁడు నిట్టి సాహసము లింక నొనర్పకు మయ్య దుర్జనుం
డన్నన సాహసక్రియల యందుఁ గడంగి నశించుఁ; గావునం
గ్రన్నన తమ్ములన్ దొరలఁ గైకొని యిమ్ములఁ బొమ్ము వీటికిన్!
సన్నుత! దీని కొండొక విషాదముఁ బొందకుమీ మనంబునన్." 89

వ. అని బుద్ధిసెప్పి వీడ్కొలిపిన నతండును దీనాననుం డగుచుం జనియె; ననుజ సహితుండయిన ధర్మతనయు ధార్మికత్వంబు ధౌమ్యాది భూసురులును దదాశ్రమ వాసులయిన మహామునులును బహువిధంబులఁ బ్రస్తుతించిరి. 90

-: o :-

# ఘోషయాత్ర

## (ఆరణ్యపర్వము : పంచమాశ్వాసము)

—ఎఱ్ఱాప్రెగ్గడ

### అవతారిక

పాండవులు కామ్యకవనమును విడిచి ద్వైతవనమున నివసింపసాగిరి. అప్పుడు హస్తినాపురమునుండి యొకవిప్రుడు వచ్చి వారిని దర్శించి, వారి కుశలము నెఱింగి హస్తినకు తిరిగిపోయెను. ఆ విప్రునివలన పాండవుల స్థితిగతులు విని ధృతరాష్ట్రుడు మిగుల దుఃఖించును. పాండవులు వనవాసమున దుఃఖము లనుభవించుచున్నా రని దుఃఖించుటతోపాటు ధృతరాష్ట్రుడు పాండవుల బలపరాక్రమములను, కౌరవులపట్ల వారికి గల క్రోధమును స్మరించి తన బిడ్డలకు పాండవుల వలన గలుగబోవు ప్రమాదమును గూర్చి వాపోవును. ధృతరాష్ట్రుకు ఈ విలాపమంతయు దుర్యోధనాదుల సమక్షముననే చేయును. అది విని దుర్యోధనాదులు ఏమి చేసిరో పాఠ్యభాగమున వర్ణింపబడినది.

## వ్యాఖ్యానము

1. వివిక్త ప్రదేశంబునకు = ఏకాంత స్థలమునకు; కార్య+ఆలోచనంబున=చేయవలసిన పనిగూర్చి చింతించుట.

విశే : ధృతరాష్ట్రుడు పాండవుల బలపరాక్రమములను పేర్కొని వారి వలన తనపుత్రులకు ప్రమాదము కలుగ గలదని శంకించుచుండెను. విశేషించి భీమార్జునులవల్ల తన వంశమునకు నాశనము తప్పదని విలపించు చుండెను. అర్జునుడు పాశుపతాస్త్రము సంపాదించిన యంశమును గూడ పేర్కొనెను, ఈ మాట కర్ణునకు బాకువలె పొడిచి కొనెను. కనుక అతడు దుర్యోధనునకు కార్యము నుపదేశింప బూనుకొనెను.

2 పాలిత-శౌర్యులు=పోషింపబడిన పరాక్రమము గలవారు; దుఃఖ-శీలురు=దుఃఖపడు స్వభావము గలవారు; విశ్రుత-లక్ష్మి=ప్రసిద్ధమైన రాజ్యలక్ష్మి; పరువడి=క్రమముగా; పెంపు-ఒలయన్=అభివృద్ధి కలుగునట్లు; అరిగాపులు=సామంతులు; నిఖిల-జలధి-శైల-కానన-ద్వీప-విశాలము=సర్వమలైన సముద్రములు పర్వతములు, అడవులు ద్వీపములు—వీనిచేత విస్తారమైన; సురలోకము=స్వర్గము.

తా: గొప్ప పరాక్రమము గల పాండవులు ఇప్పుడు దుఃఖస్వభావులై యడవుల పాలయిరి. పూర్వము ఇంద్రప్రస్థ పురమున గొప్పయభివృద్ధితో ధర్మరాజు అధీనమం దుండిన రాజ్యలక్ష్మియంతయు నీ బుద్ధిబలముచే నీకు వశమైనది. క్రమముగా దక్షిణ, పశ్చిమ, ఉత్తర, పూర్వదిక్కులందలి రాజులందరు నీకు సామంతులైరి. ఇప్పుడు శైల కానన ద్వీపములతో విస్తారమైన భూమండలమంతయు దేవేంద్రుడు స్వర్గమును పాలించునట్లు నీవే విలాసముగా పాలింపుము.

విశే: వనవాసమున దుఃఖపడుచున్న పాండవులు నిర్వీర్యులైరని కర్ణుని యభిప్రాయము. అర్జునుడు తపస్సు చేసియు, తన శౌర్యముచే శివుని మెప్పించి పాశుపతాస్త్రమును సంపాదించె నని వినియు కర్ణునకు బుద్ధి కలుగ లేదు. పాండవులను భుజబలముచే గెలువజాలక కపటద్యూతము నవలంబించిన దుర్యోధనుడు ధర్మజుని రాజ్యమును బుద్ధిబలముచే సంపాదించెనని కర్ణుడు పొగడుచున్నాడు. పాండవులు రాజ్యము చేయుచుండగా సర్వదిక్కులందలి రాజులును ధర్మరాజునకే అరిగాపులై యుండిరి. అది చూచి ఓర్వజాలక దుర్యోధనుడు మాయాజూదము కల్పించెను. పాండవులు అడవులకు పోయినంతనే పూర్వము వారికి సామంతులైన రాజులందరు కౌరవులకు సామంతులైరి. వంచనచే సాధింపబడిన దుర్యోధనుని వైభవమును కర్ణుడు కొనియాడుచున్నాడు.

8. జానపదుల్=పల్లెలందు నివసించువారు; పురీ—జనులు=నగరములందుండువారు; సంతతమున్=ఎల్లప్పుడును; ప్రమదంబు=సంతోషము; ఎలర్పన్=అతిశయింపగా; నీదైన=నీయొక్క; శుభ+ఉదయంబు=మేలు యొక్క అభివృద్ధినే: హృదయంబులన్=మనస్సులలో; కోరుచున్; ఉన్న వారు; సమ్మానమున్+ఒంది=గౌరవముపొంది; కౌరవ-సమాజము=కురు వంశమునందలి వారెల్లరు; నిన్నున్; భజింపన్;=సేవించుచుండగా; భూరి= గొప్పదైన; తేజన్+నిధివై=ప్రతాపమునకు నిలయమై; ఈ+మహిన్=ఈ లోకమున; నీవ=నీవే; సూర్యుని-చాడ్పున=సూర్యునివలె; వెలింగెదవు= ప్రకాశింతువు.

తా: పల్లెలందలి ప్రజలు, పట్టణములందలి ప్రజలు సంతోషముతో ఎల్లప్పుడును తమ హృదయములలో నీ యభ్యుదయమునే కోరుచున్నారు. ప్రజల యాదరణ బొందుచు కౌరవ సమాజమంతయు నిన్ను సేవించు చుండగా నీవు గొప్ప తేజమునకు నిలయమై ఈ లోకమున సూర్యునివలె ప్రకాశింతువు.

విశే: రాజులందరు నీకు కప్పములు కట్టుచున్నారు. ప్రజలందరు నీ యభ్యుదయమునే కోరుచున్నారు. కౌరవులందరు నిన్నే సేవించుచున్నారు. పాండవుల మాట పూర్తిగా మాసిపోయినది. నీకింక తిరుగులేదని కర్ణుడు దుర్యోధనుని ఉప్పొంగజేయుచున్నాడు. పై పద్యమున నీవు భూలోక దేవేంద్రుడవని పొగడి ఈ పద్యమున నీవు భూలోక సూర్యుడవని స్తుతించు చున్నాడు. ఇది యంతయు పలుకుటలో కర్ణునకు ఒక ఉద్దేశము కలదు. అడవులలో క్లేశము లందుచు అశక్తులవలె నున్న పాండవులకు తమ వైభవమును ప్రకటించి వారిని ఉడికించవలెనని వాని తలంపు. విశేషించి అర్జునుని దీనస్థితి చూచి ఆనందింపవలెనని వాని ఆశ. అది మెల్లగా బయటపెట్టబోవుచున్నాడు.

4. పరమ-దుఃఖ+ఆర్తులు=గొప్పదుఃఖముచేత పీడింపబడిన వారు; ద్వైత-వన-సరోవర-సమీపంబున=ద్వైతవనమందలి మేలయిన కొలని దగ్గఱ; ఘర్మ-సమయంబు=గ్రీష్మఋతువు; తపన-తేజంబు = సూర్యుని వేఁడిమి; కమరన్=కందునట్లు, మాడునట్లు; హృదయ-ఖేదంబు=గుండె బ్రద్దలగుట; మిత్ర-జన-మోదంబు=మిత్రులయిన వారియొక్క సంతోషము; ఖేదంబు= దుఃఖము.

విశే: 'కర్ణుని తల భారతము' అని సూక్తి. కర్ణుడు లేని భారతము లేదు. భారతమందలి ప్రధాన ఘట్టములు పెక్కింటికి కర్ణుడే కారణము. అధర్మ ద్యూతమున నోడించి, యవమానించి, యడవులపాలు కావించియు దుర్యోధనుఁడు పాండవులగూర్చి చింతించుట మానలేదు. వారిని పరాభవించుటకు మార్గములు వెదకుచునే యుండెను. కర్ణుఁ డాతనికి ఉపాయము చెప్పెను. తన సామ్రాజ్యవైభవము ప్రకటమగునట్లుగా ద్వైతవనమున కరిగి దుర్యోధనుఁడు పాండవులను ఉడికింపవలయును. దుర్యోధనునకు ఉపమానముగా కర్ణునకు 'నహుషపుత్రుండైన యయాతి' తోచెను. నహుషుడు ఇంద్రపదవి నందియు అధికారమున శప్తుఁడై యజగరరూపము దాల్చి యవనిపైఁ బడెను అతని పుత్రుఁ డయిన యయాతియు శరీరముతో స్వర్గమున కరిగియు అహంకారము కారణముగా ఇంద్రునిచే స్వర్గమునుండి త్రోసివేయఁబడెను. ఈ యవమానము వల్ల దుర్యోధనుఁడు గూడ సామ్రాజ్య మదమును ప్రదర్శించి పదవీ భ్రష్టుడు కాగలడని సూచింప బడుచున్నది. 'మిత్రజనమోదంబున శత్రుజన ఖేదంబు నుంగదా సంపదలకు దగియెడు ఫలంబు' అను నీతి రాక్షసము. అది కణికుడు బోధించినది. విదురనీతికాదు. ఇట్టినీతి రాజునకు ఆపదలు తెచ్చునది.

5. ధన-ధాన్య-పుత్ర-బాంధవ-జన లాభంబులును=ధనము, ధాన్యము, పుత్రులు, బంధుజనులు వీనియొక్క ప్రాప్తికూడ; అలరుట=సంతోషించుట.

తా: ధనధాన్య పుత్రాదుల ప్రాప్తి సంతోషకరమే. కాని తాను సుఖముగా నుండి. శత్రువులు మహాదుఃఖముల ననుభవించుచుండగాఁ జూచి పొందు సంతోషమునకు ధనధాన్యాదుల ప్రాప్తివల్ల కలుగు సుఖము సాటిరాదు.

విశే: తన లాభమువల్ల తాను సుఖముగా నుండగోరుట మానవ సహజము ఎదుటివాని నష్టమువల్ల తాను సుఖపడగోరుట అమానుషము. ఇట్టి కోరికకు దైవము తోడ్పడదు. అన్యుల చెడును కోరువాడు తానే చెడును.

6. నారలు=నారచీరెలు; కూరలు=కాయలు; కందమూలములు; అశనంబుగా=ఆహారముగా; ఉగ్రవనంబు = భయంకరమైనఅడవి; విపత్+భారము = ఆపదయొక్క బరువు, గొప్పయాపద; వందురిన=క్లేశపడిన; ఫల్గునున్=అర్జునుని; ఉజ్వల-రాజ్య-వైభవ+ఉదారులము=ప్రకాశించుచున్న రాజ్యసంపదచే గొప్పవారము; కృత+అర్థత =ధన్యత, తృప్తి; కౌరవ+ఈశ్వరా=కౌరవరాజా

తా: నారచీరెలు దాల్చి కందమూలములు దినుచు భయంకరమైన యడవిలో మిక్కిలి యాపదనొంది క్లేశపడుచున్న యర్జునుని గొప్పరాజ్యవైభవముతో బోయి చూచి యానందించుటకంటె మనకు తృప్తి వేరొకటి కల్గునా దుర్యోధనా?

విశే: పాండవులనుండి మనము హరించిన రాజ్యవైభవమును వారి యెదుటనే ప్రదర్శించి వారిని ఏడ్పించి మనము సంతోషించుటకంటె మనకు వేఱు తృప్తి యేమి కలదు? అని కర్ణుని యుద్బోధ. కర్ణునకు అర్జునునిపట్ల ప్రత్యేకమైన యీర్ష్య కనుక అతడు ప్రత్యేకముగా ఫల్గునుని పేర్కొనెను.

వ్యా; వి: ఉగ్రవనము=ఉగ్రమైన వనము-కర్మధారయము
విపత్+భారము=విపత్తుయొక్క బరువు-షష్ఠీసమాసము
వైభవ+ఉదారులు=వైభవోదారులు
కౌరవ+ఈశ్వరా=కౌరవేశ్వరా
కృత+అర్థత=కృతార్థత-సవర్ణదీర్ఘసంధి.
విపత్+భారము=విపద్భారము-జశ్త్వాదేశసంధి

7. అతుల+సౌభాగ్య-భోగ-సమగ్ర-మహిమన్=సాటిలేని పతి ప్రేమయొక్కయు, సుఖములయొక్కయు, నిండైన గొప్పదనముతో; దేవి+లు=

రాణులు: ధృతి=ధైర్యము; తరిగి=తగ్గి; పాండవ+అంగన (సవర్ణ దీర్ఘసంధి) = పాండవులభార్యయైన ద్రౌపది; ఎరియు=మండు, తపించు.

తా: సాటిలేని పతి ప్రేమతో, సుఖానుభవముతో ఒప్పుచున్న నీ రాణులను గాంచి ధైర్యము కోల్పోయి ద్రౌపది హృదయమున మండి పోవలదా? (పాండవాంగన అని ఏకవచనమే ఉండవలెను)

విశే: కర్ణాదులకు ద్రౌపది యన్న కడుపుమంట. ఆమె స్వయంవరమున కేగి, మత్స్యయంత్రమును భేదింపజాలక భంగపడిరి అర్జునునితో యుద్ధమాడి పరాభవింపబడిరి. జూదము నప్పు డామెను సభ కీడ్చి, వివస్త్రను జేయ యత్నించి, తొడపై గూర్చుండరమ్మని కనుసన్నచేసి, అసమర్థులైన యైదుగురు భర్తలతో నుండుటకంటె సమర్థుడైన యొక్కనిని బొందుట మేలని గేలిచేసియు కర్ణాదులు తృప్తిపడరైరి. కౌరవుల భార్యలు కూడ ద్రౌపది సౌందర్య సౌభాగ్య భోగములను గాంచి యసూయపడిరి. ఇప్పుడు ఆ ద్రౌపది యడవులలో బాధపడుచుండఁగా జూచి యందఱును ఆనందింపవలెనని కర్ణునిబోధ. దుర్యోధనునకు భీమునితో స్పర్థ కలదు గాని యర్జునునితో లేదు తన స్పర్థగల ఫల్గునుని ముందు పేర్కొని కర్ణుడు తరువాత ఎల్లరకు స్పర్థగల ద్రౌపదిని పేర్కొనినాడు. దుర్యోధనునకు ఈ ప్రతిపాదన నచ్చినది. వెంటనే కర్ణుని ప్రతిపాదనము నంగీకరించుచున్నాడు.

వ్యా: వి. దేవి+లు=దేవులు

సూ. ఇత్తునకు బహువచనంబు పరంబగునపుడు ఉత్వం బగు.

8. ఇది+పోలన్=ఇది తగును (గసడదవాదేశము); నాగ - కేతనుండు=పాము జెండాయందు గలవాడు, దుర్యోధనుడు (బహువ్రీహి); కొండొక=కొంచెము; విచారించి=ఆలోచించి.

9. తలపు = ఆలోచన; అతి+ఇష్టము = మిక్కిలి ప్రియము; భూతల-పతి=రాజయిన ధృతరాష్ట్రుడు; అనుమతింపన్+పోలదు = అంగీకరింప సాధ్యముగాదు.

తా: నా యాలోచనయు నిట్టిదే. నీవును ఈ విధముననే తెలిపితివి. ఇది మిక్కిలి యిష్టమైనది. మనము ద్వైతవనమున కరుగుట ధృతరాష్ట్రుని మనస్సునకు సమ్మత మగునదిగా కనఁబడదు.

10. అంబికేయుడు=అంబికా పుత్రుడైన ధృతరాష్ట్రుడు; పార్థులు=పృథ (కుంతీ) పుత్రులైన పాండవులు; విగ్రహము=కలహము.

తా: ఆ ద్వైతవనమున పాండవు లుండుట ధృతరాష్ట్రు డెరుంగును. మనము ఆ వనమున కరుగుట పాండవులతో కలహ మాడుటకే యని యాతడు తలంచును. కనుక మనలను తప్పక వారించును.

విశే: దుర్యోధనునకు తండ్రి మనస్సు తెలియును; తన యాలోచనలను తండ్రి పసికట్టగల డనియును తెలియును.

వ్యా: వి: ఆ+వనము=అవ్వనము - త్రికసంధి
పాండవులతోడ+విగ్రహము=పాండవులతోడి విగ్రహము

సూ॥ చేత, తోడ, వలనలకు ఇత్వంబు సమానంబులం దగు.

11. అదియునుంగాక

సూ॥ కొన్నియెడల ద్రుతంబుమీద నకారంబు కానంబడియెడి-అదియు ను-న్-కాక.

12. ఉరుతర-విక్రమ+ఆఢ్యులు=మిక్కిలి గొప్ప పరాక్రమముగల వారు; మహనీయ-తపస్+విశేష-సుస్థిరులు = గొప్ప తపస్సు యొక్క ఆధిక్యముచేత దృఢమైనవారు; పృథా-సుతుల-దిక్కున=కుంతీపుత్రులయిన పాండవులపట్ల; తద్దయు=మిక్కిలి; భీతుడు=భయపడినవాడు; నిరంతరము =ఎల్లప్పుడు; మానవ+ఇంద్రుడు=రాజయిన ధృతరాష్ట్రుడు; ఎదన్=హృదయమునందు; తాపమున్ = దుఃఖమును; వింటె=వింటివా; ఈ+కురు-విభుడు = ఈ కురురాజు; కూర్చి = ప్రేమ చూపి; విలాపము+చేసెన్ = శోకించెను.

తా: గొప్ప ప్రతాపము గలవారనియు, గొప్ప తపస్సంపదగలవారనియు ఈ ధృతరాష్ట్రుడు పాండవుల పట్ల భయపడినవాడై యెల్లప్పుడును తాపము చెందుచుండును. వింటివా? ఇంతసేపు వారినిగురించి యీ ధృతరాష్ట్రుడు ప్రేమపూర్వకముగా విలపించియుండెను.

విశే: పాండవు లన్యాయముగా నడవులకు పంపబడి కష్టపడుచుండిరని ధృతరాష్ట్రుడు వారిని తలంచికొని దుఃఖపడుచుండెను. తమ్ముని బిడ్డల యందు అతనికి గల సహజప్రేమ యిది. పాండవులు గొప్ప ప్రతాపము, తపశ్శక్తియు గలవారనియు ధృతరాష్ట్రుడు నిరంతరము భయపడుచుండెను. వారివల్ల తన కుమారులకు ప్రమాదము వాటిల్లునని వాని భయము. తనబిడ్డల క్షేమమును గురించిన ధృతరాష్ట్రుని యాందోళన యిది.

వ్యా: వి. విక్రమ+ఆఢ్యులు=విక్రమాఢ్యులు—సవర్ణదీర్ఘసంధి.
తపస్+విశేష=తపోవిశేష—అసంతసంధి.
మానవ+ఇంద్రుడు=మానవేంద్రుడు-గుణసంధి.
కడున్+కూర్చి=కడుఁగూర్చి-సరళాదేశ సంధి.

13 పెట్టుచోటు = పోషించు స్థానము; పాండవ-పక్షపాతి = పాండవుల పక్షమున పడినవాడు; పాండవులయందు అభిమానముగలవాడు; సన్న =గుర్తు సంజ్ఞ; ఎల్ల-భంగుల=సర్వవిధముల; ఒనరించుకొని=ఉంచుకొని, ఏర్పాటు చేసికొని; రేపకడ=ఉదయమున; కురుపితామహుండు = కౌరవుల తాతయైన భీష్ముఁడు; ఒడంబఱచి= ఒప్పించి; అభ్యంతర-గృహంబు = లోపలి మందిరము, అంతఃపురము; సముచిత-ప్రకారంబున =తగిన విధముగా; ప్రభాతము=ఉదయము.

విశే: ద్వైతవనమున కరిగి పాండవులను దుఃఖపెట్టవలెనన్న ఆలోచన తోచినంత దుర్యోధనాదులకు ఒక్క-క్షణముకూడ ఆలసింప బుద్ధిపుట్టలేదు. 'రేపకడ' ఆ పనికి బయలుదేర నిశ్చయించిరి. భీష్మునిఁ ధృతరాష్ట్రుని వేఱు వేఱుగా కలిసి వారియనుమతి పొందదలుచుట కుటిలనీతి. కర్ణుడు రాత్రియెల్ల ఉపాయాలోచనయందే గడపెను. తోఁచిన ఉపాయమును దుర్యోధనున కెఱింగించుటకై ప్రభాతమునందే వాని దర్శనమునకు వచ్చెను. శకునికంటె ముందే వచ్చి తానే ప్రభువునకు ఉపాయము చెప్పవలెనని కర్ణుని యారాటము.

14. భూతల-నాథ=రాజయిన దుర్యోధనుడా; పోలన్=తగినట్లుగా; విదితంబుగ=ఎల్లరకు దెలియునట్లుగా; గో-కదంబముల్ = గోవుల మందలు; తత్+విలోకము=వానిని చూచుట; పేరన్=మిషతో, నెపముతో; ధారుణి+ఈశ్వరుండు=రాజయిన ధృతరాష్ట్రుడు; చేకూఱున్=నెరవేరును, లభించును.

తా: దుర్యోధనా! నేను తగిన యుపాయమును కనుగొంటిని. ఆ ద్వైతవనమునం దిప్పుడు మన యాలమంద లున్నవని యెల్లరకుం దెలియును. వానిని చూచుట యను నెపముతో మనము ద్వైతవనమునకుఁ బోవచ్చును. ఈ కారణము చెప్పినచో ధృతరాష్ట్రుడును భీష్ముని యనుమతించును. సర్వ విధముల మన కోరిక తీరును.

వ్యా: వి. తత్+విలోకనము=తద్విలోకనము.

సూ॥ స్వరములుగాని, సరళములుగాని పరమగునపుడు తత్పూర్వ్వ మందలి పరుషములకు సరళము లాదేశమగును.

ధారుణీ+ఈశ్వరుండు=ధారుణీశ్వరుండు—సవర్ణదీర్ఘసంధి.
గో-కదంబముల్=గోవులయొక్క కదంబములు-షష్ఠీసమాసము
ఎల్లభంగులన్=సర్వములైన విధములన్-కర్మధారయము.

15. సుబల-తనూజుడు = సుబలునియొక్క కొడుకు (షష్ఠి) శకుని; నీ+ఆన=నీ యాజ్ఞ. నీతోడు; తెల్లంబుగ=స్పష్టముగా; ఈ వెరవె = ఈ యుపాయమే; భావించితిని=ఊహించితిని; ప్రహసిత-ముఖులు = మిక్కిలి వికసించిన ముఖములు గలవారు (బహువ్రీహి).

తా: కర్ణుడు తనకు దోచిన యుపాయము చెప్పగా శకుని 'ప్రభూ నీతోడు. నేనును రాత్రి యచ్చముగా ఈ యుపాయమునే యూహించితిని' అనెను. అప్పుడు పక పక నవ్వుకొనుచు— క్రిందికి అన్వయము.

విశే: కర్ణుడు, శకుని, ఒకరికంటె ముందుగా ఒకరు దుర్యోధనుని దర్శించి యుపాయము తెలుపవలె నని తలంచిరి. కర్ణుడే ముందువచ్చి తన యుపాయము చెప్పసాగెను. ఇంతలో శకునియు వచ్చి తనకుగూడ అచ్చముగా ఆ యుపాయమే తోచెనని చెప్పెను. వేఱు వేఱుగా ఆలోచించినను దుష్టులైన శకుని కర్ణులకు ఒకే యుపాయము తోచెను. కర్ణుడు ముందే చెప్పెను. గనుక శకుని "నీతోడు" అని ఒట్టుపెట్టుకొని చెప్పవలసి వచ్చెను.

వ్యా. వి: నెఱ+మనము=నెమ్మనము.

సూ. అన్యంబులకు సహిత మిక్కార్యంబు కొండొకచోఁ గానం బడియెడి. ఇక్కార్యమనఁగా ఆద్యక్షర శేషమునకు కొన్ని యెడల నుగాగమము కొన్ని యెడల మీది హల్లునకు ద్విత్వము అగుట.

16. కఱపికొని = నేర్పికొని; సముచిత...విశేషంబులు = తగిన సంభాషణము, ఉపచార విశేషములు; సుముఖున్ = సంతుష్టుని; కీలారంబు =పసులమంద; అభిముఖుండు=ఎదురుగా తిరిగినవాఁడు.

విశే: ఒండొరుల చేయి సఱచి నవ్వుట తిరుగులేని యుపాయము లభించెగదా యన్న యుత్సాహ హర్షముయొక్క యభినయము. 'కఱపికొని' యనుట తమ పన్నుగడకు దగినట్లుగా నసత్యములాడుట, ఆ గోపాలునకు జక్కగా నేర్పి రనుట "వీఁడె యొక్క గోపకుండు వచ్చె" నని చెప్పి చూపినను అంధుడైన ధృతరాష్ట్రుడు "వాని కభిముఖం" డగుట సాధ్యముగాదు. వాడు ధృతరాష్ట్రు

నకు జయపెట్టగా అశబ్దమువచ్చిన దిక్కునకు దిరిగి ధృతరాష్ట్రుఁడు వానిని "పసుల సేమమేమి?" అని యడిగి యుండవలయును.

వ్యా. వి: ఆ+మువ్వురు=అమ్మువ్వురు- త్రికసంధి.
సమంగనామధేయుఁడు = సమంగుడు అను నామధేయము కలవాడు-బహువ్రీహి.
ద్వైతవనము=ద్వైతము అను వనము-సంభావనా పూర్వపద కర్మధారయము;

17. ద్వైతవనంబు+అట్టి=అట్టి ద్వైతవనమువంటి; సుఖ-+వాసము= సుఖమైన నివాస ప్రదేశము; ధాత్రీతలనాథ=రాజా; ప్రదీప్తములై = విజృంభించి; సతతంబు=ఎల్లప్పుడు;గో-వ్రాత-భయంకరంబులు=గోవుల సమూహములకు భయము గలిగించునట్టి; వాలు-మృగంబులు=అడవి పందులు (క్రూర మృగములు); తెఱఁగు=విధము; చెచ్చెరన్=త్వరగా.

తా. ఓ ధృతరాష్ట్ర మహారాజా! ద్వైతవనమువలె పశువులకు సుఖముగా నివసించుటకు దగిన నెలవు వేఱొచ్చటను లేదు. కాని ప్రస్తుతము అడవి పందులు పెచ్చు పెఱిగి యాలమందలకు భయము గలిగించుచు సంచరించుచున్నవి. ఆ విధమంతయు తమకు తెలియజేయుటకై నేను వచ్చితిని.

విశే: ద్వైతవనము పశువులుండుటకు చక్కగా దగిన యడవి అచ్చట నుండి వానిని తరలింపరాదు. అచ్చట నవి యెట్టిభయమును లేకుండ సంచరించుచున్నవి. కాని ఇప్పుడిప్పుడు అడవి పందులు పెచ్చుపెరిగి వానికి భయము పుట్టించుచున్నవి. ఇవి దుర్యోధనాదులు గోపకునకు నేర్పిన మాటలు. సింహ శార్దూలాదులవల్ల పశువులకు బాధగా నున్నదన్నచో ఆలమందలను వేఱుచోటికి దరలింపుఁడని ధృతరాష్ట్రుడనును కనుక అడవి పందుల వల్ల గోవ్రాతమునకు భయము కలుగుచున్నదని వార్త.

18. అనంతరంబ=వెంటనే; కర్ణ-సౌబలులు=కర్ణుఁడు, శకుని; దుష్ట మృగ-నాశంబు=చెడ్డ జంతువుల యొక్క సంహారము; గో-గణ-సంరక్షణంబు=ఆవుల మందలయొక్క రక్షణము; భవత్+సూనున్=నీయొక్క కుమారుని; కొండొక=కొంత;

విశే: గోపాలుడు తాము నేర్పిన వాక్యములను ధృతరాష్ట్రునకు దెలియ జెప్పిన వెంటనే కర్ణుడు, శకుని "ఆలస్యము చేయకుండ దుర్యోధనుని గోరక్ష ణార్థము పంపుము" అని త్వరపెట్టిరి. ధృతరాష్ట్రుడు వృద్ధుడు, అంధుడు అయినను కర్ణశకునుల శీలముల నెఱింగినవాడు. కనుక అతడు వెంటనే సరే యనక కొంచెము ఆలోచించి సమాధానము చెప్పెను. గోరక్షణార్థము తన పుత్రుడైన దుర్యోధనుని పంపవలెనా? ఏల? ఇతరులాపని చేయలేరా! ఈయల్ప కార్యమునకు దుర్యోధనుఁడు (యువరాజు) పోవలెనా? పైగా ఈ సలహా కర్ణ శకును లిచ్చుచున్నారు కనుక దీనిలో ఏవో కుట్ర యుంతవచ్చును. ఇట్లు ధృత రాష్ట్రుఁడు ఆలోచించెను.

వ్యా వి: భవత్సూను దుర్యోధను నియోగింపుము.

సూ. విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగ విభక్తి వచనంబు లగు. (కారక) "దుర్యోధనున్" అను విశేష్యము పుంలింగము, ద్వితీయా విభక్తి, ఏకవచనము. కనుక దానికి విశేషణమైన "భవత్సూనున్" అను నదియు పుంలింగము, ద్వితీయా ఏకవచనము.

కర్ణ సౌబలులు=ద్వంద్వ సమాసము

19. గో-రక్ష = గోవులయొక్క రక్షణము; దుష్ట - మృగ - విధ్వం సంబు=క్రూర జంతువులయొక్క సంహారము; ఆ+వన+అంతరమునన్ = ఆ వనమునందు; ఆసక్తిమై=ప్రీతితో; గరిష్ఠ+ఆత్ములు=మిక్కిలి గొప్పదైన స్వభావము గలవారు; రూఢ-ప్రతాప+ఆఢ్యులు = దృఢమైన (ప్రఖ్యాతమైన) పరాక్రమము గలవారు; గమనంబు=పోవుట; ప్రియంబు=ఇష్టము, మంచిది; ఏ+భంగులన్=ఏ విధములచేతను.

తా: గోరక్షణము చేయుట యుచితమే. దుష్టమృగములను సంహరించు టయు ఆలోచింపగా ఉచితముగానే యున్నది. అయినను వినుడు:- ఆ ద్వైతవనమునందు, ఉన్నత స్వభావులు, ప్రతాపవంతులునైన పాండవులు ప్రీతితో నివసించుచున్నారు. అందువలన మీరా యరణ్యమునకేగుట మంచిదని నా మనస్సునందేవిధముగను తోఁచుటలేదు,

విశే: దుష్టమృగసంహారము చేసి గోరక్షణ యొనర్తురు సరియే కాని పాండవులందు బద్ధ మత్సరులయిన మీరు ఆ శిష్టులను బాధింపబోయి యాత్మ నాశనము దెచ్చుకొందురేమో! అప్పుడు మీకు రక్ష యెవ్వరు? కనుక మీరు ద్వైతవనమున కేగుట ఏవిధముగను మంచిదిగా నాకు తోపకున్నది. "వినుఁడు"

అనుటవల్ల అది ధృతరాష్ట్రుడు వారికి హెచ్చరికతో చెప్పదలచిన మాట. తండ్రి యిట్లనునని దుర్యోధను డెఱుంగును. (చూ. 6—9 పద్యములు).

వ్యా. వి: అవ్వనాంతరము } ఎబ్బంగులన్ } త్రికసంధి

వన+అంతరము } ప్రతాప+ఆఢ్యులు } గరిష్ఠ+ఆత్ములు } సవర్ణ దీర్ఘసంధి

20. బన్నము = అవమానము; పార్థులు = పృథ (కుంతి) యొక్క కొడుకులు- పాండవులు; పన్నగ-రిపు-సన్నిభుండు = పాముల శత్రువైన గరుడునితో సమానమైనవాడు; పవనజుడు=వాయుపుత్రుడైన భీముడు.

తా: పాండవులు ఇంతకుముందుకూడ మీ చేత అవమానములు పొంది బాధపడుచున్నారు. మిమ్ములను చూచినంతనే సర్పవిరోధియైన గరుత్మంతుని వంటి భీముడు మనస్సులో కోపము పొందకుండునా?

విశే: పాండవులను మీ రిదివరకే అవమానించి యున్నారు. ఇప్పుడు మీ రేమియు చేయకున్నను వారికి మీపై కోపము ఉండనే యున్నది. మిమ్ము చూచి నంతనే వారు మండిపడుదురు. విశేషించి భీముడు మహాకోపి, అతడు పన్నగ రిపు సన్నిభుడు. కౌరవులు, వానివీరులు, పాములవంటి వారు; భీముడు గరుత్మంతునివంటి వాడు. దుర్యోధనుని, అతని వీరులను చూచినంతనే భీముడు కోపించి యందరను మ్రింగివేయును.

21.—

22. ఓర్చె=ఓడించెను; కృత+అస్త్రుడు = నేర్వబడిన అస్త్రములు కలవాడు; ప్రకటిత-బాహు-విక్రముడు = ప్రకటింపబడిన భుజ పరాక్రమము గలవాడు; అతి+అకుటిల-దివ్య-బాణ-యుతుడై=మిక్కిలి సూటియైన దేవతా సంబంధమైన యస్త్రములతో గూడినవాడై; ఎలమిన్=ప్రీతితో; రణ-భూము లన్=యుద్ధరంగములందు.

తా: అస్త్రములు సాధింపక ముందే తానొక్కడే భూమియంతయు గెల్చి యర్జునుడు తన భుజపరాక్రమము ప్రకటించి యుండెను. ఇప్పుడు దేవేంద్రుని వద్ద గొప్ప దివ్యాస్త్రములను సంపాదించి తిరిగివచ్చెను. అట్టి వానిని యుద్ధము లందు ఎదిరించుటకు ఎవ్వరికైన శక్యమగునా?

విశే: ధృతరాష్ట్రుడు గ్రుడ్డివాడైనను రాజనీతినిధి కనుక చారుల వల్ల పాండవుల వృత్తాంతము నెప్పటికప్పుడు తెలిసికొనుచునే యుండెను రాజసూయమునకు ముందు అర్జునుడు అస్త్రములను సంపాదించి యుండలేదు. ఐనను కేవలము భుజబలముచేతనే అతడు దిగ్విజయము గావించెను. దుర్యోధనాదులకును ఆ విషయము తెలియును. అరణ్యవాసకాలమును అతడు వ్యర్థముచేయలేదు. శివుని మెప్పించి పాశుపతాస్త్రమును సంపాదించెను. ఇంద్రాది దేవతల వల్ల పెక్కు దివ్యాస్త్రములు సంపాదించెను. గొప్ప తపస్సు చేసెను. ఈ నడుమనే స్వర్గమునుండి తిరిగి వచ్చెను. ఇప్పుడింక అతనిని యుద్ధమునం దెదిరించు శక్తి ఎవ్వరికి నుండదు. దుర్యోధనాదులు భ్రమపడి పాండవులను అరణ్యమునందు అవమానింప యత్నింతురేమో అని ధృతరాష్ట్రుడీ యంశములను ఎత్తిచూపుచున్నాడు. కొడుకు సంగతి, అతని మిత్రుల సంగతి ధృతరాష్ట్రు డెరుగును. నిజమునకు వారు ఘోషయాత్రకు బయలుదేరుటయు పాండవుల నవమానించుటకే గదా. ధృతరాష్ట్రునకీ సంగతి తెలియకున్నను దుర్యోధనుని స్వభావము తెలియును.

వ్యా: కృత+అస్త్రుడు-సవర్ణదీర్ఘసంధి; బహువ్రీహి.
మహా+ఇంద్రు=మహేంద్రు-గుణసంధి.
అతి+అకుటిల=అత్యకుటిల-యణాదేశసంధి.

28. చెనసి=ఎదిరించి; ఎగ్గు=అపకారము; వగవన్=ఆలోచింపగా; వలసినన్=అవసరమైనచో; ఘోష-రక్షణము=ఆలమందలను గాపాడుట; పుత్తము=పంపుదము.

తా: మీరు వారిని ఎదిరించి యపకారము చేయుట, వారు మీకపకారము చేయుట ఆలోచింపగా మేలుకాదు. అవసరమైనచో గోవులను రక్షించుటకై తగినవారిని వెంటనే ద్వైతవనమునకు బంపుదము.

విశే: కౌరవులు తొందరపాటు కలవారు. ముందు వారే పాండవుల నెదిరించి కీడు చేయుదురు. అప్పుడు పాండవులు కీడుచేయుదురు ఇదియెట్లును మంచిదికాదు. 'వలసిన'-అంత అవసరమైనచో—గోవులకు మృగబాధ కలుగుచున్నదన్న మాటయందు గూడ ధృతరాష్ట్రునకు నమ్మకము లేదు. గోపాలుని వెంట దుర్యోధనాదులు వచ్చుటచే అతనికి అనుమానము కలిగెను. అంతగా అవసరమైనచో గోరక్షణకు తగిన వారిని పంపుదము మీరు వద్దు అనుచున్నాడు.

వ్యా : పుచ్చు+దము=వు_త్తము

సూ. చువర్ణంబుతోడి దుగ్దకారంబునకు తరకారంబగు.

24. ఒడంబడు=అంగీకరించు; అంబికేయుండు = అంబికయొక్క పు_త్రుడు - ధృతరాష్ట్రుడు.

విశే: ధృతరాష్ట్రు డంగీకరింపకుండుట చూచి శకుని యారంభించి నాడు. ఆ సమయమున ధృతరాష్ట్రుని యెదుటనున్న వారి నామములే వారి గుణములను సూచించును. దుష్టమైన యద్ధము చేయువాడు దుర్యోధనుడు. కపటముగా ఇతరులను గెలువజూచువాడు శకుని. శకుని యనగా కీడును సూచించు పక్షి. చెవిచెంతజేరి దురాలోచనలు చెప్పువాడు కర్ణుడు. గొల్లవానిపేరు సమంగుడు. అనగా సమముగా గమనముచేయువాడు— ఈ దుష్టులతో కూడి వచ్చువాడు.

25. పాలిత—వి_క్రమ+ఉన్నతులు = పొందబడిన పరా_క్రమ విశేషము గలవారు; _ప్రతిజ్ఞా-లలితుండు=సత్యదీక్షచే మృదువైనవాడు; తత్+శీలము=అతని స్వభావమును; సిద్ధము=నిశ్చయము.

తా: పాండవులు గొప్ప పరా_క్రమాతిశయము కలవారు. వారికి మేమేల అనిష్టమాచరింతుము. ఒకవేళ మేము వారి క_ప్రియము చేసినను సత్య సంధుడైన ధర్మరాజు సత్యము నేల తప్పును? ఆయన తమ్ము లాయన స్వభావము నేల యతి_క్రమింతురు. ఇది నిశ్చయము. నీవు నీ మనస్సున నమ్ముము.

విశే : పాండవులు మహా పరా_క్రమవంతులని మే మెఱుంగమా? వారికి మేము కోపము తెప్పింపము. ఒకవేళ తెప్పించినను, శాంత స్వభావుడైన ధర్మరాజు తమ్ములను యుద్ధమునకు దిగనీయడు. నీకు భయమువద్దు అని శకుని యనుచున్నాడు. మేము పాండవుల జోలికి పోము అని మా_త్రము శకుని యన లేదు. తాము పాండవులను ఉడికించినను ధర్మజుడు శాంతుడు గనుక యుద్ధము వరకు రాదని శకుని నమ్మకము.

వ్యా: ఒనర్చు+దము=ఒనర్తుము-దుగ్ధకారసంధి.
వి_క్రమ+ఉన్నతులు=వి_క్రమోన్నతులు-గుణసంధి.
నెఱ+మనము=నెమ్మనము.

సూ. అన్యంబులకు సహిత మికా_ర్యము కొండొకచో గానం బడియెడి.

26. మృగయా-కౌతుకము=వేటయందలి యుత్సాహము; గో—గణ—రక్షా-కరణము=గోవుల మందల రక్షణచేయుట

తా: మాకుగూడ వేటయందు ఉత్సాహము అతిశయముగా నున్నది. గోవుల సంరక్షణమును చేయదగినదే కదా. ఈ విషయమున నెట్టి కీడు మాత్ర మేల కలుగును?

విశే: వేట ముచ్చట తీరును. గోరక్షణ జరుగును. ఒక్క పనికి రెండు ఫలములు కలుగును. నష్టమేల కలుగును అని శకుని వాదము. మే మింత మంచిపని తలపెట్టగా నీవు కీడు శంకింతువేల యని మందలింపు.

వ్యా. మృగయా-కౌతుకము=వేటయందలి తమకము.
సప్తమీ తత్పురుషము.
మహీ+ఈశా=మహీశా-సవర్ణ దీర్ఘసంధి.

27. కొండొక=కొంత; గో-ధనము=పశుసంపద.

తా: శకుని యట్లనగా ధృతరాష్ట్రుడు కొంత యాలోచించి యిట్లనెను: బుద్ధిమంతులై పశుసంపదను రక్షించి ఆలసింపక వెంటనే తిరిగిరండు. ఇట్లని ధృతరాష్ట్రుడు చిట్టచివరకు వారికి అనుమతి యిచ్చెను.

విశే: వెళ్ళుచున్నది గోరక్ష కొరకు గనుక ఆ పని ముగించుకొని బుద్ధిమంతులై వెంటనే మరలిరండు. అచ్చట అనవసరముగా తడసినచో ఏదేని కీడు జరుగవచ్చును— అని ధృతరాష్ట్రుని హెచ్చరిక. ఎంతో ఆలోచించి, ఎన్నో బుద్ధులు చెప్పి అంధరాజు అనిష్టముతో తప్పనిసరియై అంగీకరించెను.

వ్యా. ఏలకు+ఏలకు=ఎట్టకేలకు—ఆమ్రేడిత సంధి.
గోధనము—రూపక సమాసము.

28. కౌతుక+అతిశయ—వ్యగ్ర—హృదయుడు=ఉత్సాహము యొక్క అతిశయమువల్ల తహతహపడుచున్న మనస్సుకలవాడు; ఫణధర+ఇంద్ర—కేతు=నాగరాజు జెండాయందు కలవాడు; కరిపురంబు=హస్తినా పురము; ఘోషింపబడియె;=చాటింపబడెను; ఘోషయాత్ర = అలమందలను గురించిన ప్రయాణము; ప్రకటలీల=స్పష్టమైన తీరున.

తా : ఆ క్షణమందే ఉత్సాహాతిశయముచే తొందర పడుచున్న మనస్సు గల దుర్యోధనుని యాజ్ఞచేత ఘోషయాత్రను గుఱించిన వార్త హస్తినాపుర మందెల్ల చాటింపబడెను.

విశే : తండ్రి యనుమతి లభించిన క్షణమందే దుర్యోధనుడు ఘోష యాత్ర చాటింపు వేయించెను. ఇదియేదో దండయాత్రయన్నట్లు ఘోషయాత్ర వెడలుదమని దుర్యోధనునకు సలహా యిచ్చినవారు, అందుకు ధృతరాష్ట్రుని వద్ద అనుమతి సంపాదించినవారు కర్ణ శకునులే. దుర్యోధనుడు తండ్రిముందు అసలు మాట్లాడనేలేదు.

వ్యా : కౌతుక+అతిశయ=కౌతుకాతిశయ-సవర్ణదీర్ఘసంధి.
ఫణధర+ఇంద్ర=ఫణధరేంద్ర-గుణసంధి
కరిపురంబు-సంభావనాపూర్వపద కరధారయము

29. ప్రహృష్ట+ఆత్ముడు=హర్షించిన మనస్సు కలవాడు; లలిత+అంబర+ఆభరణ+అంగరాగ+విస్ఫురిత -మూర్తిన్ = సుకుమారములయిన వస్త్రములు, అలంకారములు, మైపూతలు మున్నగు వానిచే ప్రకాశించురూపమున; సముచిత-వాహన-సైన్య-సమేతులు=యోగ్యమైన వాహనములతో, సైన్యము లతో కూడినవారు; ఉజ్జ్వల-విభూతి=ప్రకాశించుచున్న వైభవముతో; ఆందో శికా+ఆది-వాహనములన్=పల్లకులు మున్నగు వాహనములందు; తత్+ప్రియ-ప్రమదలు=వారి ప్రియకాంతలు; బహు-సహస్రములు = పెక్కు వేలు; కైసేసి=అలంకరించుకొని; ప్రకట-శకట-వైశ్య-పణ్యాంగనా + అది-సంకు లము=మేలయినబండ్లుగల వైశ్యులు వేశ్యలు మున్నగు వారిచే సందడియైనది; ఉల్లసిల్లె=ఒప్పెను.

తా: అంతట మిక్కిలి హర్షించిన మనస్సుగలవాడు, మంచి వస్త్రములు, అలంకారములు మైపూతలు తాల్చి శోభిల్లు రూపముగలవాడై దుర్యోధనుడు తన తమ్ములను, కర్ణశకునులను, ఇష్టబంధువులును తమకు యోగ్యములయిన వాహనములతో, సేనలతో కూడినవారై కొలుచుచుండగా ఉజ్జ్వలమైన వైభవ ముతో బయలుదేరెను. పల్లకులు మున్నగు వాహనములపై ప్రియకాంతలు పెక్కు వేలమంది చనిరి. పౌరులందరును చక్కగా నలంకరించుకొని తమభార్య లతోగూడి సంతోషముతో వెంబడించిరి. పలువిధములయిన బండ్లపై వైశ్యులు, వేశ్యలు బయలుదేరిరి. ఇట్లు ఘోషయాత్ర మిక్కిలి సందడిగా నుండెను.

విశే: పశువులను గాపాడుటకు పోవుచుంటిమని ధృతరాష్ట్రునివద్ద అనుమతి పొందినను దుర్యోధనాదులు తాము తలపెట్టినట్లుగా పాండవులను ఉడికించు నుద్దేశముతోడనే తమ వైభవపుంతయు ప్రకటమగునట్లు బయలు దేరిరి

వ్యా: సహ+ఉదరులు=సహోదరులు-గుణసంధి
కర్ణగాంధారులు-ద్వంద్వ సమాసము
ప్రియ బాంధవులు }
ఉజ్జ్వల విభూతి } కర్మధారయ సమాసము
బహుసహస్రములు }

30 అనురూపంగా = తగినట్లు; శత-సహస్ర-సంఖ్య = నూరువేల సంఖ్య; మృగయా-కుశలులు=వేటయందు నేర్పరులు; మృగయులు=వేట కాండ్రు; విట-విదూషక-వంది—వైతాళిక+ఆది—అనుజులు=శృంగారపురుషులు హాస్యగాండ్రు, స్తోత్ర పాఠకులు, వివిధ తాళములతో గానము చేయువారు మున్నగు జనులు; అనుగమించిరి=వెంటనేగిరి; గవ్యూతి—మాత్రంబగు=ఎద్దు అంకె వినబడునంత మాత్రము దూరము; దిన-శేషము=పగటిలో మిగిలిన భాగము; వివిధ-గిరి-గహనంబులు=అనేకములయిన పర్వతములు అరణ్యములు; అతిక్రమించి=దాటి

వ్యా: ఆ+మహీపతి=అమ్మహీపతి-త్రికసంధి
ముప్పదివేలు-ద్విగు సమాసము
మృగయాకుశలులు=వేటయందు నేర్పరులైనవారు—సప్తమీ తత్పురుష సమాసము

31. నానా-సహస్ర—సంఖ్యానంబులు = పెక్కువేల సంఖ్యగలవి; సంతత+ఆనంద-విగత-భయత్వ—లీలన్ = నిరంతరమైన యానందముచేత పోయిన భయముగల విధముగా; అతి-సంకులంబుగ=మిక్కిలి సందడిగా; కుంద-శంఖ—చంద్ర-హార—నీహార—డిండీర-పటీర—ముక్తాహార—హీర-సంకాశములును=మొల్లపూవులు, శంఖములు, కర్పూరపు దండలు, మంచు, నురుగు, మంచిగంధము, ముత్యాలదండలు, వజ్రములు-వీనివంటివి; కాదంబ-కాలేయ-కాదంబినీ—నీలజాల-తమాలికా-సన్నిభవములు=నల్లహంసలు, కారిజము, మేఘమాల, ఇంద్రనీలమణి సమూహము, కానుగుచెట్లు—వీనివంటివి; ప్రౌఢ-బంధూక కాంచన—చంపక — విస్ఫుటములు = వికసించిన ఉమ్మెత్త, సంపెంగ

పూలవలె ప్రకాశించునవి; వర్ణంబులు=రంగులు; నేత్ర+అభిరామ-భంగిన్= కన్నులకు ఇంపైనవిధముగా; గో-కదంబంబు=పశువుల సమూహము

తా: అనేక సహస్రముల సంఖ్యతోనుండి, ఎడతెగని యానందముచే నిర్భయ స్థితిగలవై, ఆ ద్వైతవనమందు ఏ దిక్కు చూచినను చిక్కని గుంపులై-తెల్లని, నల్లని,ఎఱ్ఱని, పచ్చని రంగులు గల్గి కన్నుల కింపు గొలుపుచున్న గోవుల మందలను ఆ దుర్యోధనుడు చూచెను.

విశే: పశువుల మందలు నిర్భరమైన యానందముతో ఏ మాత్రమును భయము లేక సుఖముగా నున్నవి దుర్యోధనాదులు తండ్రికి ఎంత యసత్యము కల్పించి చెప్పిరో ఈ మాట స్పష్టము చేయుచున్నది. ఆ గోవులు అనేక వర్ణములుగలవి. నానా వర్ణములుగల గోవులు మందగాచేరి యున్నప్పుడు వర్ణ సమ్మేళనము నేత్రములకు అభిరామముగా నున్నదట: శబ్దములలో చక్కని చిత్రము రచించినాడు ఎఱ్ఱన తెలుపులో, నలుపులో, ఎరుపులో, పసుపులో ఎన్నో ఛాయాభేదములుగల గోవులు మందలు గట్టియున్నవి. నెల్లూరు మండలవాసియైన ఎఱ్ఱనకు గోవులనిన మిక్కిలి ఇష్టము.

వ్యా: సంతత+ఆనంద-సవర్ణ దీర్ఘసంధి
ఆ+కాననము-త్రికసంధి
గో-కదంబములు-షష్ఠీ తత్పురుషము
నేత్ర+అభిరామ-సవర్ణ దీర్ఘ సంధి
అలంకారము: ఉదాత్తము, వృత్త్యనుప్రాసము.

32. గోపాల-సమన్వితుడై = గోపాలురతో గూడినవాడై ఆ-పొలమున = ఆ ప్రదేశమున; గో-రస+ఆస్వాదన-లీలా-పరితృప్తి = గోవుల యొక్క పాలను త్రాగుటయందలి వినోదమువలనితృప్తి; ఎలర్చెన్=సంతోషించెను.

తా: గోపాలురతోగూడి దుర్యోధనుడును, అతని మిత్రులను గోక్షీరమును త్రావుటయను వినోదముచే తృప్తిపడి యానందించిరి.

వ్యా: గోపాల—సమన్వితుడు — గోపాలురతో గూడినవాడు—తృతీయాతత్పురుషము.

33. తత్+అనంతరంబ = దానితరువాత; గాయక-నర్తక+ఆదులు=గానము చేయువారు, నృత్యము చేయువారు, మొదలుగా గలవారు;

వంది-మాగధ-జనంబులు=సమయసూచన చేయువారు, వంశమును కీర్తించు వారునైనజనులు; అభిమత-ధనంబులు = ఇష్టమైన ధనములు; మృగయా-వినోదంబు=వేటయనెడిక్రీడ; తొడంగి=పూని

34 భూప—శ్రేష్ఠుడు=రాజులలో శ్రేష్ఠుడైన దుర్యోధనుడు; హరిణ=లేళ్ళయొక్క; వ్రాతములన్=సమూహములను; కలంచుచున్=చీకాకుపరచుచు; ఉదగ్ర=భయంకరములయిన; అనేకప=ఏనుగులయొక్క; శ్రేణిన్=సమూహమును; చెచ్చెరన్=త్వరగా, వెంటనే; బంధించుచు=కట్టివేయుచు; ఉగ్ర=క్రూరములైన; సింహ=సింహములయొక్క; నివహ=సమూహముయొక్క; ఛేద+ఏక=నరకుటయే ప్రధానముగాగల; సంక్రీడ=వినోదముచేత; బంధురతన్=గాఢమైన స్థితితో; పేర్చుచున్=విజృంభించుచు; ప్రస్ఫురత్=ప్రకాశించు; మహిష=అడవిదున్నలయొక్క; శార్దూల=పెద్దపులులయొక్కయు ఉద్ధత=పొగరెక్కిన; క్రోడ=అడవిపందులయొక్కయు; నిర్భర=నిండైన; పాతంబులు = పడగొట్టుటలు, చంపుటలు; ఒనర్చుచున్ = చేయుచు; ఆ+కానలోన్=ఆ వనమునందు; తిరిగెన్=విహరించెను.

తా: ఆ దుర్యోధనుడు లేళ్ళగుంపులను చీకాకు పరచుచు, మదపుటేనుగులను బంధించుచు, క్రూరసింహములను నరకుటయందు క్రీడించుచు అడవి దున్నలను, పెద్దపులులను, అడవి పందులను బడగొట్టుచు ఆ వనమునందు సంచరించెను.

విశే: పశువులకు బాధగలిగించని లేళ్ళను చెదరగొట్టుట, రాజులకు యుద్ధములందుపయోగపడు మదపుటేనుగులను బంధించుట, సింహములను పులులను, అడవి దున్నలను పశుపులకు ప్రమాదకరములు గనుక నరకుట— దుర్యోధనుడు ఈ పనులందు ఔచిత్యమును పాటించెను.

వ్యా; ఉదగ్ర—అనేకప=ఉదగ్రానేకప—సవర్ణదీర్ఘ సంధి
ఛేద+ఏక=ఛేదైక—వృద్ధిసంధి
శార్దూల+ఉద్ధత=శార్దూలోద్ధత—గుణసంధి
ఆ+కానలో=అక్కానలో—త్రికసంధి
నిర్భర- పాతంబు—కర్మధారయము
భూప—శ్రేష్ఠుడు—షష్ఠీ తత్పురుషము
హరిణ—వ్రాతము—షష్ఠీ తత్పురుషము

అలంకారము: ఉదాత్తము

ఛందస్సు; మత్తేభ విక్రీడిత వృత్తము

గణములు : స భ ర న మ య వ

యతిస్థానము : 14 వ అక్షరము. ప్రాసనియమము కలదు.

* సమగ్రవ్యాఖ్యకు ముఖ్యము.

35. అనవత–సురభి–సరసీరుహ–ప్రకర–పరికీర్ణంబులగు = ఎడతెగని సుగంధముగల తామరపూవుల సమూహములచేత ఆవరింపబడినవైన; జల+ఆశయంబులు=సరోవరములు; ఆలోకించుచు=చూచుచు; అతి–మనోహర–ప్రసూన–ఫల–భరిత–పాదప–వన + అభ్యంతరంబులన్ = మిక్కిలి అందమైన పూవులతో, పండ్లతో నిండిన వృక్షములు గల అరణ్యముల లోపలి భాగములందు; మన్మథ–మయూర–మధుకర–కీర–కోకిల+ ఆలాప–కోలాహలంబులు = మనోహరములయిన నెమళ్ళ, తుమ్మెదల, చిలుకల, కోకిలల స్వరములచే ధ్వనిసంకులము లయిన; ఆకర్ణించుచు=వినుచు; పరిజన–సమన్వితుండు=సేవకులతో గూడినవాడు; ముని–జన–సహాయుండై = మునులతో గూడినవాడై, వన్యంబులు=వన సంబంధమైనవి; ఫల–మూల–విశేషంబులు = పండ్లయొక్కయు, దుంపల యొక్కయు భేదములు; సాధనంబులుగా = ఉపకరణములుగా, యాగద్రవ్యముగా; సద్యస్కందంబు=ఒక యాగము పేరు; నిజ– భృత్య–జనులన్=తన సేవకులను; క్రీడా–గృహంబులు=విహార భవనములు;

విశే: దుర్యోధనాదులు ఆలమందలనుజూచి తరువాత వేటలాడి క్రమంబున" చని ద్వైతవన సరోవరము చేర జనినట్లుండుటవల్ల ఘోషములున్న చోటికి ధర్మజాదులున్న చోటు కొంతదూర మని గ్రహింపనగును. పాండవులు నివసించు ప్రదేశము చూచి యచ్చట క్రీడాగృహంబులు నిర్మించుటకు దుర్యోధనుడు నిశ్చయించెను.

వ్యా: సరస్+వరములు=సరోవరములు—విసర్గసంధి

ఆ+కొలను=ఆక్కొలను–త్రికసంధి .

క్రీడా + గృహంబు–క్రీడకొఱకైన గృహము–చతుర్థీ తత్పురుష

పరిజన సమన్వితుడు—పరిజనులతో కూడినవాడు — తృతీయా తత్పురుష

36. సంభ్రమమున=తొందరతో; ఆ+వారిరుహ + ఆకరము = ఆ సరస్సు (త్రికసంధి; సవర్ణదీర్ఘసంధి); క్రీడ + అగారములు= క్రీడకొరకైన భవనములు (సవర్ణదీర్ఘసంధి; చతుర్థీ తత్పురుషము); పారుదెంచి = పరుగెత్తి వచ్చి;

తా: దుర్యోధనుని పరిజనము త్వరగా ఆ సరోవర సమీపమున క్రీడా మందిరములు నిర్మింపబూనగా పరువునవచ్చి గంధర్వులు వారిని వారించుచు—

37. గంధర్వ—పతి = గంధర్వుల యొక్క—రాజు (షష్ఠీ తత్పురుష); కల్పితంబు=ఏర్పాటు చేయబడినది; మగుడన్ + మరలి; తిరిగి; రణ—దుర్మదులు=యుద్ధమందు మదించినవారు (సప్తమీ తత్పురుష)

38. బలియుండు=బలముగలవాడు; మహా—బాహుండు=గొప్ప భుజ బలము గలవాడు; అలఘుండు=గొప్పవాడు; కమల+ఆకరంబు = తామర కొలను; క్రీడా+అర్థంబు=విహారము కొరకు; కౌతూహలంబు = ఆసక్తి, ఉత్సాహము; ఎలయంగా=కలుగగా; ప్రియ—కామినీ—సహితుడు = ఇష్టమైన స్త్రీలతోగూడినవాడు; ఉద్ధత క్రోధులు=రేచబడిన క్రోధముగలవారు .

తా: బలవంతుడు, గొప్పభుజశక్తిగలవాడు, గొప్పవాడు, ధృతరాష్ట్రుని కుమారుడైన దుర్యోధనుడు విహారముకొఱకు ఉత్సాహము కలుగగా ప్రియకాంతలతోగూడి యీ కొలనికి క్రీడార్థము వచ్చుచున్నాడు. కనుక మీ రిచ్చట నుండవద్దు; తొలగిపొండు" అని దుర్యోధనుని సేవకులు పలుకగా విని గంధర్వులు రేగిన కోపముగలవారై -

వ్యా; మహా-బాహుడు=గొప్పబాహువులు గలవాడు } బహువ్రీహి
ఉద్ధత-క్రోధులు=ఉద్ధతమైన క్రోధముగలవారు } బహువ్రీహి
కమల+ఆకరము=కమలాకరము-సవర్ణ దీర్ఘసంధి
కమలములకు ఆకరమైనది—షష్ఠీతత్పురుషము.

39. పెలుచ=నిర్లక్ష్యముగా.

విశే: కౌరవ భటులు దుర్యోధనుని గొప్పదనమును గూర్చి ప్రశంసించి గంధర్వులను భయపెట్టజూచిరి. కాని గంధర్వులు వారి మాటలను విని ఒకరి మొగ మొకరు చూచుకొని పకాలున నవ్విరి. చిత్రసేనుని యధీనమందున్న

సరోవరమున క్రీడింపగోరుటయే కాక ఆ సరోవరము తనదేయని దుర్యోధనుడు తలచుట గంధర్వులకు హాస్యాస్పదమైన అహంకారముగా దోచినది.

40. తా: ఎదిరిని తన్ను నెఱుంగజాలని మీ దుర్యోధనుడు అహంకారముచే తన మానమును ప్రాణమును కోల్పోవ దలచుచున్నాడు. కానిచో ఈ చెడ్డపను లేమి?

వివే: గంధర్వభటులన్న ఈ మాటలో దుర్యోధనుని సహజశీలము ఉన్నది. పాండవుల శక్తిని, తనశక్తిని చక్కగా నెరుగని కారణమున దుర్యోధనుడు ఈ ఘోషయాత్రకు బయలుదేరెను. ఇప్పుడు గంధర్వుల శక్తిని, తన శక్తిని ఎఱుంగక వారితో కలహమునకు దిగెను. ఇట్టివాడు మానము ప్రాణము గోల్పోవుట తప్పదు. అక్రమముగా పాండవుల రాజ్యము హరించుట; చిత్రసేనుని క్రీడాసరస్సును అక్రమింప దలచుట చెనటి చెయ్వులు.

41. లెస్స=మంచిది, మేలు; తత్+వచనంబులు=వారి మాటలు; రోష+ఆవేశ-వివశుండు=రోషముయొక్క ఆవేశముచేత ఒడలు తెలియనివాడు; దుర్వినీతులు=చెడునీతి గలవారు, మంచినడవడి లేనివారు; సుర-గణ సమేతంబుగా=దేవతల సమూహములతో గూడి.

విశే: గంధర్వభటుల మాటలువిని దుర్యోధనుడు తన ప్రయత్నము మానుటకు బదులు రోషావేశము పొందెను. తాను దుర్వినీతుడైయుండి గంధర్వులను దుర్వినీతులని పలుకుచుండెను. ఇంద్రుడు వచ్చినను లెక్కపెట్టవద్దని తన వీరులకు ఆజ్ఞ యిచ్చుచుండెను. ఇది మదముచే మాన ప్రాణములు గోల్పోదలచిన వాని లక్షణము.

వ్యా: తత్+వచనంబులు=తద్వచనంబులు-సంస్కృత సరళాదేశసంధి
సరస్+వరంబు=సరోవరంబు—అసంతసంధి

42. అతుల-చతురంగ-సేనా+అన్వితులయి=సాటిలేని నాలుగు అంగములతోడి (రథ, గజ, తురగ, పదాతి అని సేనాంగములు నాలుగు) సైన్యముతో గూడినవారై; నిరతిశయ-రయ+ఉద్ధత-సింహనాద-బధిరీకృత-దిక్+ముఖులు=గొప్పదైన వేగముచే రేచబడిన సింహనాదముచేత చెవిటివిగా జేయబడిన దిక్కుల మొదళ్ళు గలవారు (గొప్పసింహనాదములు దిక్కులందు మారుమ్రోగునట్లు); కినుక=కోపము; ఎలర్పన్=అతిశయింపగా.

తా: గొప్ప చతురంగ బలములతో గూడినవారై ధృతరాష్ట్రుని కుమా లందరు సింహనాదములు దిక్కులు పిక్కటిల్లునట్లు కోపోద్రేకముతో బయలుదేరిరి.

విశే: సరోవరమునకు కావలియున్న గంధర్వభటులను శిక్షించుటకు ఇందరు వీరులు ఇన్ని సేనలతో పోనక్కరలేదు. అట్లు పోవుట తమ బలసంపదను గంధర్వులకు జూపి వారు పలికిన మాటలకు తగినట్లు బుద్ధిచెప్పుటకు. పరుషముగా చెప్పినను గంధర్వభటులు శాంతముగనే చెప్పిరి. కాని దుర్యోధనుడే ముందు కయ్యమునకు కాలు దువ్వెను. ఇది వాని స్వభావము. ఇట్టి కొందరపాటు పడవద్దనియే ధృతరాష్ట్రు డెన్నో బుద్ధులు చెప్పి పంపెను

వ్యా: రయ+ఉద్ధత=రయోద్ధత—గుణసంధి
సేనా+అన్వితులు=సేనాన్వితులు—సవర్ణదీర్ఘ సంధి
దిక్+ముఖులు=దుఙ్ముఖులు-అనునాసిక సంధి
కినుక+ఎలర్పన్=కినుక యెలర్పన్-యడాగమ సంధి

48. ప్రియ-పూర్వకముగా=ప్రియము ముందగునట్లుగా, ప్రేమతో, శాంతముగా; విద్వేషంబు=వైరము; సేనా+అగ్ర-చరులు = సేనలయొక్క ముందుభాగమున నడచువారు, సేనా నాయకులు; ప్రచుర-శస్త్ర+అస్త్ర-పాతంబు=తరుచైన శస్త్రములయు, అస్త్రములయు పడుటలు; ప్రబల-రోష-రంజిత+ఆననుండు=తీవ్రమయిన రోషముచేత ఎఱ్ఱపడిన ముఖముగలవాడు.

విశే: కౌరవులు పెద్దసైన్యములతో వచ్చిపడగా గంధర్వభటులు శాంతముగ కలహము వద్దని వారించిరి. కౌరవ వీరులు వారి మాటలకు సమాధానము చెప్పలేదు. వెంటనే యుద్ధము ప్రారంభించిరి. ఇది వారి దురహంకారమునకు, అకారణ కలహ ప్రియత్వమునకు గుర్తు. గంధర్వభటులు ఈ వార్త చెప్పగా విని గంధర్వరాజు రోషరంజితాననుడైనాడు; తన భటుల మాటలు విని దుర్యోధనుడు క్రోధావేశ వివశుండైనాడు. దుర్యోధన చిత్రసేనుల స్వభావములలో భేదమిది.

వ్యా: సేనా+అగ్ర=సేనాగ్ర
శస్త్ర+అస్త్ర=శస్త్రాస్త్ర
రంజిత+ఆననుండు=రంజితాననుండు } సవర్ణదీర్ఘసంధి.

మాతోడ+విద్వేషంబు=మాతోడ విద్వేషంబు

సూ: చేత, తోడ, వలనలకు ఇత్వంబు సమాసములందగును

44. పొదిగి=చుట్టుముట్టి; సమయింపుడు=చంపుడు; బహు-సహస్ర-సంఖ్యలన్=పెక్కువేల సంఖ్యగలవారిని; గంధర్వ-వరులన్ = గంధర్వులలో శ్రేష్ఠులయినవారిని; ప్రకటిత-బలులన్=ప్రకటింపబడిన (ప్రసిద్ధమైన) బలముగలవారిని.

తా: త్వరగావెళ్ళి మీరు ఆ దుర్మార్గులయిన కౌరవులను సంహరింపుడు అని (చిత్రసేనుడు) బలశాలురైన గంధర్వ శ్రేష్ఠులను పెక్కువేల మందిని పంపెను.

విశే: దుర్జనులైన కౌరవులను సంహరించి రండనియే (గంధర్వరాజు) ఆదేశము. ఆయనకు అంత రోషము కలిగినది.

వ్యా: ప్రకటిత-బలులు=ప్రకటింపబడిన బలము కలవారు - బహువ్రీహి

గంధర్వవరులు=గంధర్వులలో శ్రేష్ఠులు-షష్ఠీ తత్పురుషము.

45. —

46. ఆయత=విశాలమైన, పెద్దదైన; కుంత=ఈటెలు; కార్ముక=విండ్లు; గదా=గదలు; అసి=కత్తులు; పరశ్వధ=గొడ్డళ్ళు; శూల = బల్లెములు; పట్టిన=అడ్డకత్తులు; ఆది=మొదలుగాగల; ఆయుధ = ఆయుధముల చేత; ఘోర=భయంకరమైన; హస్తులు=హస్తములు గలవారును; కుల+అచల=కుల పర్వతములవలె; తుంగ=ఎత్తయిన; తనుల్=శరీరములు గలవారును; ప్రచండ=ఉగ్రమైన; తేజః+యుతులు=తేజస్సు కలవారును (ఐన); ఆ-వియత్+చరులు=ఆ గంధర్వులు; శూరతమై=పరాక్రమముతో; నడతెంచి=వచ్చి; కురురాజ=దుర్యోధనుని యొక్క; సైన్యమున్=సేనను; బల్విడిన్=శక్తితో, వేగముతో; కో+అనీ=కోయని యఱచుచు; ఉగ్ర=భయంకరమైన; రణ = యుద్ధమునందు; కోవిదులు+ఐ=పండితులై, నేర్పరులై; తాకిరి=ముట్టిరి.

తా: కుంతములు; కార్ముకములు, గదలు, శూలములు మున్నగు ఆయుధములు ధరించి, కులపర్వతములవలె ఉన్నతములైన శరీరములుగల వారు, ఉగ్రమైన ప్రతాపముగలవారునైను గంధర్వులు శూరతతోవచ్చి, ఉగ్రరణ పండితులై ఆ కురురాజు సైన్యమును "కో" యని యఱచుచు గొప్ప బలముతో తాకిరి.

వ్యా. గదా+అసి=గదాసి
పట్టిస+ఆది=పట్టిసాది } సవర్ణ దీర్ఘసంధి
కుల+అచల=కులాచల

ఆది+ఆయుధ–అద్యాయుధ–యణాదేశసంధి
తేజః+యుతులు=తేజోయుతులు-విసర్గసంది
వియత్+చరులు=వియచ్చరులు—శ్చుత్వాదేశసంధి
రణ-కోవిదులు=యుద్ధమునందు నేర్పరులు-సప్తమీతత్పురుష

ఛందస్సు: ఉత్పలమాలా వృత్తము
కణములు: భ ర న భ భ ర ల గ

యతి: 10వ అక్షరము
ప్రాసనియమము కలదు
* సమగ్రవ్యాఖ్యకు ముఖ్యము

47 బెట్టిదంబుగా=తీవ్రముగా, కఠినముగా; కిట్టి=తాకి; దుశ్శాసన+ఆది-కౌరవులు = దుశ్శాసనుడు మొదలుగాకల కౌరవులు; స-సైన్యంబుగా=సైన్యముతోగూడి యుండునట్లు; తెరలి=తొలగి, కలగి; భల్ల+అర్ధచంద్ర-ప్రముఖ-బహుళ - బాణ- పాతంబులన్ = బల్లెములు, అర్ధచంద్రబాణము మున్నగు అనేకములయిన బాణముల పాతములచేత; తదీయ-దేహంబులు=వారి శరీరములను; సైనిక- శతంబులన్ = నూరుల కొలంది భటులను; రూపుమాపు=చంపు; తోతెంచినం=కనబడగా.

విశే: సింహనాదములు చేయుచువచ్చిన కౌరవవీరులు, దుర్యోధనుని తమ్ములు గంధర్వుల ధాకకు తాళలేక దుర్యోధనుని మరుగునజేరిరి. పాపము కర్ణుడొక్కడే గంధర్వుల నడుమజిక్కి పోరాడుచుండెను. కౌరవులు తొలగిపోవుటవల్లను, క్రొత్తగా గంధర్వులు వచ్చునట్లు కనబడుటచేతను భూమి

మంతయు గంధర్వమయమైనదా యన్నట్లు కర్ణునకు తోచెను. ఇది కర్ణుని ఉత్ప్రేక్ష. గంధర్వమయము కాకున్నను గంధర్వమయమైన ట్లుండెను.

48. ప్రబల సైన్యముతో = బలిష్ఠమైన సేనతో; నడతేరన్ = నడచిరాగా; ఆహవ+ఉత్సుక-మతి = యుద్ధమునందు ఆసక్తిగల మనస్సు గలవాడు (బహువ్రీహి); ప్రకట—భుజా+ఉగ్రతన్ = ప్రసిద్ధమైన భుజముల తీవ్రతతో, బల్విడి = వేగముగా, తత్+రిపు—కోటిన్ = ఆ శత్రువుల సమూహమును, సకల—జగత్+భయంకర—లసత్ సమర + ఉత్సవము = సర్వ ప్రపంచమునకును భయము కలిగించు ఒప్పయిన యుద్ధపుపండుగ.

తా: శకునియు, తమ్ములును గొప్పసైన్యముతో వెంట వచ్చుచుండ యుద్ధము నందాసక్తిగల దుర్యోధనుడు కర్ణుడు యుద్ధముచేయుచున్న ప్రదేశము నకు వచ్చి యాశత్రువులను ఎదుర్కొనగా సర్వప్రపంచమునకును భయము కలిగించు గొప్ప యుద్ధము జరిగెను.

విశే: అందరను యుద్ధమునకు పంపి దుర్యోధనుడు శిబిరమునందే యుండెను. శకునియు నాతని వద్దనే యుండెను. దుశ్శాసనాదులు గంధర్వుల ధాటికి తాళలేక పారిపోయి రాగా కర్ణుడొక్కడే యుద్ధములో చిక్కుకొనెను. ఇప్పుడు దుర్యోధనుడు శకుని దుశ్శాసనాదులతో గలిసి కర్ణుడు యుద్ధము చేయుచున్న చోటికి వచ్చి గంధర్వులను తాకెను. ఘోరయుద్ధము జరిగెను.

వ్యా: సూతతనూజుని యున్నచోటికిన్—
సూ. ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియునగు.
(ఇచట ప్రథమకు షష్ఠియైనది)

| | |
|---|---|
| సమర + ఉత్సవము=సమరోత్సవము<br>భుజ+ఉగ్రత=భుజోగ్రత | గుణసంధి |
| జగత్+భయంకర=జగద్భయంకర<br>తత్+రిపుకోటి=తద్రిపుకోటి | సంస్కృత సరళాదేశము |

49. కొండొకసేపునకు = కొంతసేపటికి; మహా+ఉద్దండ–నృప +అనేక ఘోరతర-విశిఖ-వ్యాఖండిత—శరీరులు+ఐ=మిక్కిలి భయంకరు లయిన రాజులయొక్క నానా విధములైన క్రూరములయిన బాణములచేత

ఖండింపబడిన శరీరముగలవారై; ధృతి=ధైర్యము, ఖండితముగన్=భగ్నము కాగా, పల్లటిలిరి=చలించిరి.

తా: కౌంతసేపు యుద్ధము జరుగగా మహాబలశాలులైన రాజులయొక్క నానా విధములయిన క్రూరాయుధములచే ఖండింపబడిన శరీరములు గలవారై ధైర్యము సన్నగిల్లి గంధర్వులు యుద్ధరంగమున చలించిపోయిరి.

విశే: కౌరవ పక్షమున రాజైన దుర్యోధనుడుండుటచే వారిది పైచేయి యయ్యెను అంతకుముందు గంధర్వసేన యెదుట కౌరవసేన నిలువజాలక పోయెను. ఇప్పుడు దుర్యోధనుని ప్రోత్సాహబలము కలదగుటచే కౌరవసేన గంధర్వసేనను కలవరపెట్టెను. రాజు సన్నిధి నుండుట సేనకు గొప్పబలము.

వ్యా: మహా+ఉద్దండ=మహోద్దండ-గుణసంధి
నృప+అనేక=నృపానేక-సవర్ణదీర్ఘసంధి

50. తెరలుట=తొలగుట,- క్రోధ-కలుషిత-మతి=కోపముచే మలిన మైన మనస్సుగలవాడు, గంధ-గజము-చందమున=మదించిన యేనుగు వలె, మద+అంధ-గతిన్=మదముచే కన్ను కానని తీరున, కౌరవ+అనీకము=కౌరవుల సైన్యము.

తా: గంధర్వసేన యుద్ధమున చలించుటనుగూర్చి విని గంధర్వరాజు క్రోధోద్రిక్తుడై మదించిన ఏనుగువలె కన్నుకానని విధమున కౌరవసేనపై బడెను.

విశే: అల్పమైన కారణమున నేర్పడిన కలహము పెద్ద యుద్ధముగా మారినది. భటులతో ఆరంభమై మహావీరుల వరకు వచ్చి, చివరకు రాజులు కూడ ప్రవేశింపవలసి వచ్చెను. ద్వైతవనము కౌరవ రాజ్యములోనిదే కనుక అందలి సరోవరముపై తనకు హక్కుగలదని దుర్యోధనుని యభిప్రాయము. ఆ యరణ్యమునందా సరోవరము తాను స్వయముగా కల్పించుకొనెను గనుక దుర్యోధనుడు దానిని తాకకూడదని గంధర్వరాజు అభిప్రాయము. కావలివాండ్రు మంచిమాటలతో చెప్పినప్పుడే దుర్యోధనుడు ఊరకుండిన మేలుగా నుండెడిది. కాని వాని యాహంకారము కలహమునకే మొగ్గినది. యుద్ధమునకు ముందుగా దిగిన దోషము కౌరవులందే యున్నది.

అలంకారము: ఉపమ.

వ్యా: మద+అంధ=మదాంధ
కౌరవ+అనీకము=కౌరవానీకము } -సవర్ణ దీర్ఘ సంధి
గతిన్+కవిసె=గతింగవిసె-సరళాదేశ సంధి.

51—

52. మాయా=మాయతోగూడిన, సంగర=యుద్ధమున, కోవిదుండు = నేర్పరియైన చిత్రసేనుడు, వికసత్=వికసించుచున్న, మాయా=మాయతోడి, అస్త్ర=అస్త్రములయొక్క, జాలంబులన్= సమూహములచేత, వాయు=గాలి యొక్క, వ్యాప్తి=ప్రసారము, అడంగన్ = అణగపోవునట్లును, అర్క= సూర్యునియొక్క, కిరణ=కిరణములు, వ్రాతంబు=సమూహము, రుద్ధంబు—కాన్=అడ్డగింపబడునట్లును, చేయన్=చేయుటకు, చొచ్చినన్=పూనుకొనగా, కౌరవ్య=కౌరవులయొక్క, సైన్యంబునన్=సేనయందు, తేరులు=రథములు, త్రెళ్ళెన్=కూలెన్, కరుల్=ఏనుగులు, శీర్ధంబులు+అయ్యెన్=తునకలయ్యెను; హయ+ఆలి=అశ్వముల సమూహము, దళత్-కాయంబు = బ్రద్దలగుచున్న శరీరముగలది, అయ్యెన్=అయ్యెన్, నరుల్=సైనికులు, కూలిరి=తెగిపడిరి.

తా: మాయా యుద్ధ విశారదుడైన గంధర్వరాజు మాయాస్త్రముల సమూహములచేత వాయుప్రసారము ఆగిపోవునట్లును, సూర్యకిరణములు అడ్డగింపబడునట్లును చేయసాగినంతనే కౌరవసేనయందలి రథములు కూలి పోయెను, ఏనుగులు నుగ్గయ్యెను, అశ్వములు తున్కలయ్యెను. భటులు తెగిపడిరి.

విశే: గంధర్వ రాజయిన చిత్రసేనుడు యుద్ధరంగమున ప్రవేశించి నంతనే మరల గంధర్వులది పైచేయియైనది, అతని మాయాస్త్రముల ప్రభావము నకు కౌరవులు తట్టుకొనలేకపోయిరి. వాయువు స్తంభించి, చీకట్లుకమ్మి కౌరవులకు ఊపిరి సలుపలేదు. కన్నులు కానరాలేదు. దురోధనుడు కపటయుద్ధములందు వలె చిత్రసేనుడు మాయాయుద్ధములందు నేర్పరి. వానిముందు దుర్యోధనుని యాట కట్టినది.

వ్యా: వికసత్+మాయా=వికసన్మాయా-అనునాసిక సంధి
మాయా+అస్త్ర=మాయాస్త్ర } సవర్ణ దీర్ఘ సంధి
హయ+ఆలి=హయాలి }
వాయువ్యాప్తి=వాయువుయొక్కవ్యాప్తి-షష్ఠీతత్పురుష

ఛందస్సు: శార్దూల విక్రీడిత వృత్తము
గణములు: మ స జ స త త గ
యతి: 13వ అక్షరము
ప్రాసనియమము కలదు
*సమగ్రవ్యాఖ్యకు ముఖ్యము.

53. పొదలి =విజృంభించి, పదుగురు = పదిమంది, పౌరవ-సేనన్=పూరువంశస్థులయిన కౌరవసేనను, ఆవార్య+ఉద్ధతులు=అడ్డగింపరాని విజృంభణముగలవారు (గుణసంధి, బహువ్రీహి సమాసము)

తా: గంధర్వులు విజృంభించి యడ్డగింపరాని పరాక్రమముతో ఒక్కొక్కనికి ఏబదేసిమందిగా కౌరవసేనను చుట్టుముట్టి వదలక సంహరింపసాగిరి.

విశే: మాయాబలముచే గంధర్వుల సంఖ్య పెరిగినది. చీకటిలో వారు చూడగలరు. కనుక కన్నులు కానరాకున్న కౌరవసైనికులకు ఒక్కొక్కనిని పదిమంది గంధర్వులు చుట్టుముట్టి చంపదొడగిరి.

54. ఆ+వియత్+చరులు=ఆ గంధర్వులు, కందువకు=ప్రదేశమునకు, రాధేయుండు=కర్ణుడు, అజేయుండు = జయింపరానివాడు, కులశైలంబు=కుల పర్వతము, శర-వర్షంబు=బాణములనెడి వర్షము (రూపక సమాసము), సోదర-సౌబల-సహాయుండు=తమ్ములు, శకుని సహాయులుగా గలవాడు, కర్ణ-సాహాయ్యంబు=కర్ణునకు తోడ్పాటు, అనంత-సత్త్వులైన=అంతులేని బలముగలవారైన (బహువ్రీహి).

56. సూతున్=సారథిని, చాప—దండము = వింటియొక్క కట్టె, చక్ర-యుగ్మకము=చక్రములయొక్క జంట [షష్ఠీతత్పురుషము]. విస్ఫురిత+ఆతపత్రము=ప్రకాశించు గొడుగు (సవర్ణ దీర్ఘసంధి; కర్మధారయ సమాసము), కూబరంబు = రథముయొక్క ముందుభాగము, కేతువు=ధ్వజము, అక్షమున్=ఇరుసు, దందడిన్ = త్వరగా, విరథత్వము=రథములేని స్థితి, సూత-సూతికిన్=సూతునికొడుకైన కర్ణునకు.

తా: గంధర్వులు కర్ణుని జుట్టుముట్టి కొందఱు సారథిని, కొందఱు గుఱ్ఱములను, కొందఱు వింటిని, కొందఱు రెండుచక్రములను, కొందఱు గొడుగును, కొందరు రథముయొక్క ముందుభాగమును, కొందరు జెండాను, కొందరు ఇరుసును తొందరగా నరికివైచి అతనిని విరథుని గావించిరి.

56. విముఖుండు=వెనుకకు దిరిగినవాడు, పరబలంబు=శత్రుసేన, తలపడి=ఎదుర్కొని, తదీయ-స్యందనంబు=వాని సంబంధమైన రథము, కేశ+ఆకర్షణంబు=జుట్టుపట్టిలాగుట, పెడకేలుకట్టి=చేతులు వెనుకకు విఱిచి కట్టి, కనుకనిన్=తొందరగా సంభ్రమముతో, తత్+తనూభవులను=అతని కొడుకులను, ఒప్పించిరి = ఒప్పగించిరి; పెఱ=ఇతర, అమాత్యులు = మంత్రులు.

విశే: గంధర్వుల ధాటి కోర్వలేక కర్ణునితోసహా అందఱు పాఱి పోయిరి. నిస్సహాయుడై దుర్యోధనుడు గంధర్వులకు చిక్కిపోయెను. చిత్ర సేనుడు తన కోపమంతయు దీరునట్లు దుర్యోధనుని జుట్టుపట్టి రథమునుండి క్రిందికి లాగి చేతులు వెనుకకు విఱిచి కట్టించెను. రాజు బంధింపబడినంతనే స్త్రీలనుగూడ బంధించిరి. తనవైభవము ప్రదర్శించి పాండవులను పరాభవింప ఉపాయము చెప్పిన కర్ణుడు, శకుని తప్పించుకొనిపోగా అతడు మాత్రము గంధర్వులకు జిక్కెను. అతని మంత్రులు, పౌరులు పరుగెత్తిపోయి ధర్మరాజు శరణుచొచ్చి యాతనితో మొరపెట్టుకొనిరి.

వ్యా: కేశ+ఆకర్షణంబు=కేశాకర్షణంబు-సవర్ణ దీర్ఘసంధి
పెడకేలు=కేలు పెడయగునట్లు-అవ్యయీభావ సమాసము

57. ఘన-బాహా-బల-దుర్నివార-మహిమన్=గొప్పభుజముల యొక్క బలము యొక్క అడ్డగింపరాని శక్తిచేత, తత్+కాంతలన్=అతని భార్యలను, బంధ-ప్రాప్తులన్=బంధము పొందిన వారిని, రిపు-క్షోభంబు=శత్రునాశనము, అనుజ-వ్రాతమున్=తమ్ములయొక్క సమూహమును.

తా: గొప్ప భుజబల శక్తిచేత గంధర్వవీరులు దుర్యోధనుని, అతని ప్రియురాండ్రను, తమ్ములను బంధించి కొనిపోవుచున్నారు. ఆ శత్రువులను నాశనముచేసి దయతో నీ తమ్ములను రక్షింపుమా ధర్మరాజా.

విశే: ఏ పాండవులను పరాభవింపవలెనని దుర్యోధనాదులు ద్వైత వనమునకు వచ్చిరో, ఏ ధర్మజుని సద్యస్కంద యాగమును భంగపరచుటకై దుర్యోధనుడు ద్వైతవన సరోవరతీరమున క్రీడాగృహములు నిర్మింపబూనెనో ఆ పాండవులను, ఆ ధర్మజుని దుర్యోధనాదులను విడిపింపుడని కౌరవ పక్షము వారు ప్రార్థింపవలసి వచ్చినది. "బుద్ధిమంతులరై శోధనము నరసి తడయక

రండు" అని ధృతరాష్ట్రుడు ఆనతిచ్చెను. ఆయన యానతి ననుసరించి గోరక్షణము గావించి మరలి పోయినచో కౌరవుల కీ యాపద సంభవించెడిది కాదు. వారు బుద్ధిమంతులు కాక, తండ్రిమాట వినక తడయుటయేకాక గంధర్వులతో నిష్కారణముగ తగవు తెచ్చి పెట్టుకొని ముప్పు కొనితెచ్చుకొనిరి.

వ్యా: బంధ-ప్రాప్తులు=బంధమును పొందినవారు-
ద్వితీయా తత్పురుషము.

రాజ+ఉత్తమా=రాజోత్తమా-గుణసంధి
రాజులలో శ్రేష్ఠుడా-షష్ఠీ తత్పురుషము
సహ+ఉదరులు=సహోదరులు-గుణసంధి.
సమానమైన గర్భము గలవారు-బహువ్రీహి.

58. కృత+అంజలులు=చేయబడిన దోయిలికలవారు (సవర్ణ దీర్ఘ సంధి, బహువ్రీహి సమాసము), ప్రహసిత+ఆననుడు=వికసించిన మొగము గలవాడు (సవర్ణ దీర్ఘ సంధి. బహువ్రీహి సమాసము).

విశే: పౌరులు వచ్చి దుర్యోధనాదుల దుస్థితిగూర్చి మొఱపెట్టగా భీముడు పకపక నవ్వెను. దుర్యోధనాదు లింకను పాండవులను ఉడికించునంతవరకు రాలేదు. ఈ లోపుగనే గంధర్వులతో కలహము కలిగినది. పాండవుల యెదుట వైభవము ప్రకటించి అవమానకరములగు మాటలు పలికియున్నచో భీముడే దుర్యోధనాదుల పని పట్టియుండెడివాడు. అట్టి అవసరము తనకు లేకుండ గంధర్వులే ఆపని తీర్చి రని భీముని నవ్వు. ఈ సందర్భమును బట్టియు, విరాట పర్వమందలి కీచకవధను బట్టియు "కొగల పని గంధర్వులే తీర్తురు" అని లోకమున సామెత యేర్పడినది.

59. మనకు తేలికయైనది. మనము చేయవలసిన పనినే గంధర్వవీరులు చక్కగా తీర్చిరి. ఎంత మంచిపనియైనది! ఏ శ్రమయు లేకుండ ఊరకనే మనకు జయము లభించినది.

వ్యా: ఊరక+ఉండ=ఊరకుండ.

సూ. అత్తునకు సంధి బహుళము. ఇచ్చట సంధి జరిగినది. జరుగనిచో యడాగమము వచ్చి 'ఊరకయుండ' అను రూపము ఏర్పడును.

60. పుట్టు+కల్లరి=పుట్టుక చేతనే కపటి; దిట్ట=సమర్థుడు: తిట్టు=నింద; కట్టిడి = క్రూరు; కాన్+ఒనర్చి = అగునట్లుచేసి: విధాతృడు = బ్రహ్మ.

తా: పుట్టుక చేతనే మోసగాడై, ఎట్టి పాపములు చేయుటకైనను సమర్థుడై, లోకులచే నిందలుపొందిన క్రూరునకు ఇట్టి కష్టము కలుగునట్లు చేసి బ్రహ్మదేవుడు ఈనాడు నేర్పరి యనిపించుకొనెను.

విశే: బ్రహ్మదేవుడు దుర్యోధనుని పుట్టుకచేతనే దుష్టునిచేసి లోకులకు కంటకములు కలిగించి తెలివితక్కువ వాడనిపించుకొనెను. ఈనాడు ఆ దుష్టునకు తగిన పరాభవము కలుగనట్లుచేసి నేర్పరి యనిపించుకొనెను. దుర్యోధనుని పేరు తలచుకొన్నచో భీమునకు కోపము మండుకొనిపోవును. "మిమ్ముఁ గన్నంత నలుగకుండునె పన్నగరిపు సన్నిభుండు పవనజుఁ డాత్మన్" అని ధృతరాష్ట్రుడు చెప్పెనుగదా. దుర్యోధనునిస్థితి విని భీముడు పకాలున నవ్వినను ఆ నవ్వులో కోపము ఉండనే యున్నది. ఆ కోపము ఈ పద్యమందున్నది. అన్ని పాదములందు యతి బదులు ప్రాసయతి కలదు. విశేషించి మొదటి మూడు పాదములందు 'ట్ట' ప్రాసాక్షరము. భీముడు ఈ పరుష ద్విత్వాక్షరమును ఒత్తి ఒత్తి పలికి తనకోపమంతయు వెల్లడించెను.

అలంకారము: వృత్త్యనుప్రాసము.

వ్యా: పుట్టుఁగల్లరి=పుట్టుకచే కల్లరి–తృతీయా తత్పురుషము.

61. విపరీత – స్థితి = వ్యతిరేకమైన యవస్థను; ఒంద = పొంది; ఘోర–విపిన+ఉర్వీ–వాసులు+ఐ=భయంకరమైన యడవి ప్రదేశమునందు నివసించువారై, నిత్య–దుఃఖ–పరాధీనతన్=నిరంతరమైన దుఃఖమునకు వశమైన స్థితిచేత; తూలిరి=బలహీనులైరి; అంచున్=అని తలంచుచు: గర్వ + అంధిత– స్వాంతుడు + ఐ = గర్వముచే గ్రుడ్డిదైన మనస్సుగలవాడై; మనలన్=మనలను; అపలాపింపగన్=వెక్కిరించుటకు, అవమానించుటకు; వచ్చి=వచ్చి; దుర్ణయపరుడు = దుష్టమైన నీతియందు ఆసక్తి గలవాడును; దోష–పరీత + ఆత్ముడు = పాపముచే ఆవరింప బడిన మనస్సుగలవాడును అయిన; ఆ–ధార్తరాష్ట్రుండు=ఆ ధృతరాష్ట్రుని పుత్రుడైన దుర్యోధనుడు; స+అమాత్యుడు+ఐ=మంత్రులతో గూడినవాడై; సత్యంబు = నిజముగా: తత్+ఫలంబున్=వానియొక్క ఫలితమును; కుడిచెన్=అనుభవించెను.

తా: విపరీత స్థితినిపొంది, భయంకరములైన యడవులందు నివసించుచు, నిరంతరమైన దుఃఖముచేత దీనులమై యుంటి మని తలంచి గర్వముచే కన్నుగాననివాడై దుర్నీతిపరుడు, పాపాత్ముడు నైన ఈ దుర్యోధనుడు మనలను వెక్కిరించి యవమానింపవచ్చి మంత్రులతో గలిసి తానే ఆ గర్వఫలము ననుభవించెను.

విశే: దుర్యోధనుడు పాండవుల నవమానింప జూచునని ధృతరాష్ట్రుడు తలచినట్లే పాండవులును తలంచిరి. వాని దుర్బుద్ధి యెరుగని వారెవ్వరును లేరు. అసహాయస్థితిలో నున్న ధర్మపరులను బలవంతులైన అధర్మపరులు పీడింపబోయినప్పుడు దైవమే పూనుకొని అధర్మాత్ములకు పాపఫలము కట్టి కుడిపించును. దుర్యోధనునకు అప్పుడు కలిగిన కష్టము దైవనిర్ణయ మని భీముని యభిప్రాయము.

వ్యా: విపిన+ఉర్వి=విపినోర్వి—గుణసంధి
గర్వ+అంధిత=గర్వాంధిత
పరీత+ఆత్ముడు=పరీతాత్ముడు } సవర్ణదీర్ఘసంధి
స+అమాత్యుడు=సామాత్యుడు
దుర్ణయ-పరుండు=దుర్ణయమందు ఆసక్తుడు- సప్తమీ తత్పురుష

విపరీత_స్థితి=విపరీతమైన స్థితి—కర్మధారయము
ఛందస్సు: మత్తేభ విక్రీడితము వృత్తము
గణములు: స భ ర న మ య వ
యతి: 14 వ అక్షరము
ప్రాసనియమము కలదు.
సమగ్ర వ్యాఖ్యకు ముఖ్యము.

62. వానిదెసన్=వానిపట్ల; అనుజునకు=తమ్మునకు; అగ్రజుండు=అన్న.

63. పరుష—వాక్యములకు కఠినములయిన మాటలకు; లఘుభావము = తేలిక తనము, దీనత్వము; వికల—గతిన్ = చెడిపోయిన తీరు; కౌరవ-నికరము=కౌరవుల సమూహము.

తా: అయ్యో! ఇది కఠినపు మాటలకు తగిన సమయమా? దీనభావముతో శరణుచొచ్చి చెడిపోయిన స్థితియందున్న కౌరవ సమూహముపట్ల దయ చూచుట నీకు తగదా ?

విశే: దుర్యోధనుని స్థితిని, భీముని మాటలను విని ధర్మరాజు 'అయ్యో' అనెను. ఆయనది అంత జాలిగుండె. ధర్మరాజు "ఇది తగదు" అనడు. 'ఇది తగునా?' అనును. తగదు అని యితరుడే తెలిసికొనవలెను. ఆయన మాటలాడు నాగరిక పద్ధతి అది. ఒక్క దుర్యోధనుడే కాదు, కౌరవులందరును దీన స్థితి యందున్నారు. దుర్యోధనునిపై నీకు కోపము కావచ్చును. తక్కినవారి మాటయేమి? దుర్యోధనాదులు శత్రువులచే భంగపడినచో మనము భంగపడినట్లు కదా! మనమును కౌరవులమే కదా? దుర్యోధనుని యవమానము మన కురువంశమునకే అవమానము. 'కౌరవనికరము' అన్న మాట సాభిప్రాయము. 'వారిదెస కృపసేయ వలదు' అని భీముడు ధర్మజునితో అనగా 'కరుణసేయ నీకుం దగదే' అని ధర్మరాజు భీమునితో అనెను. ఇంతకును దుర్యోధనాదులను గంధర్వులనుండి రక్షింపవలసినవారు భీమాదులు.

వ్యా: కరుణ+చేయ=కరుణసేయ
శరణు+చొచ్చి=శరణుసొచ్చి } గసడదవాదేశము

64. ఏక+అన్వయ-జాతులు=ఒకేవంశమున బుట్టినవారు; అర్థ-నిమిత్తంబయిన=ధనము కారణము కాగల; భేదంబు=వైరము; వర్తిల్లున్=జరుగును; సహజ-స్నేహంబు=స్వతసిద్ధమైన ప్రేమ; జ్ఞాతి-జనంబులు=దాయాదులు. అన్నదమ్ముల బిడ్డలు; తొడరినప్పుడ=కలిగినప్పుడు; చేకొనక=అంగీకరింపక, తోడ్పడక; లోక-నింద్యము=లోకమునకు నిందింప దగినది; సభార్యుండు = భార్యతో గూడినవాడు; ఉపేక్షించినన్ = నిర్లక్ష్యము చేసినచో; కుల-హాని = వంశనాశనము; శరణ+ఆగత - రక్షణంబు = ఆశ్రయము కొరకు వచ్చినవారియొక్క రక్షణము; రాజ మాత్రంబు వానికి=కేవలము క్షత్రియుడైనవానికి; బాహు-బల-సంపన్నుడు = భుజములయొక్క బలముచే నిండైనవాడు; ఇమ్ములన్ = సంతోషముతో; సర్వ+ఆయుధ-సన్నద్ధులై=అన్ని యాయుధములచేత సిద్ధపడినవారై; తలుగుండు=తొలగింపుడు; పవన-నందనుండు=వాయుపుత్రుండైన భీముడు.

విశే: ధర్మరాజునకు స్వీయ విషయమునందుకంటె వంశ విషయమున శ్రద్ధమెండు. భీముడు తన కోపమునే చూచుకొనెనుగాని కులగౌరవము, ప్రతిష్ఠ చూడలేకపోయెను. ఆస్తి కారణమున తాత్కాలికముగా కౌరవ పాండ

వులకు వైరము కలిగినను వారు ఏకాన్వయ జాతులు. జ్ఞాతులమధ్య వైర మెంత సాధారణమో ప్రేమ యంతకంటెను సహజము. గంధర్వులు కౌరవు లను అవమానించినప్పుడు పాండవులను అవమానించినట్లే. ధర్మరాజుయొక్క ఉదారదృష్టియందు ఈ సత్యములు గోచరించినవి. అయన చెప్పినను భీము నకు తొందరగా తోచుటలేదు.

వ్యా: ఏక+అన్వయ=ఏకాన్వయ
శరణ+ఆగత=శరణాగత } సవర్ణ దీర్ఘ సంధి
సర్వ+ఆయుధ=సర్వాయుధ
ఉప+ఈక్ష=ఉపేక్ష—గుణసంధి.

64. గృహ—దాహము=ఇంటిని తగులబెట్టుట; విహిత - దురోదర కపటుడు=ఏర్పాటు చేయబడిన జూదమున మోసగాడు; పుట్టినవోలె=పుట్టినది మొదలు; కేవలంపు+కరుణ=అచ్చమైన దయ; కార్య — హాని = ప్రయోజన నాశము, పని చెఱుపు.

తా: కొంచెమేని శంకలేక కోపించి జలములం ద్రోచెను. విషము పెట్టెను. ఇల్లు తగులబెట్టెను. మాయజూద మాడించి రాజ్య మపహరించెను. నిండు సభలో ద్రౌపదిని జుట్టుపట్టి యీడ్పించి బట్టలు ఒలిపింప జూచెను. అక్కటా: పుట్టిననాటి నుండియు ఈ దుర్యోధనుడు మనకు అపకారము చేయని రోజు కలదా? వాడు చేసిన పను లొక్కటియు నీవు తలంచుటలేదు. కేవలము వానియందు కరుణను వహించుచున్నావు ఇట్లయినచో మనకు పని చెరుపు కాదా!

విశే: ధర్మరాజునకు దుర్యోధనునిపై కోపము తెప్పించవలెనని. భీముడు వాని క్రూరచర్యల నన్నింటిని ధర్మరాజునకు గుర్తుచేయుచున్నాడు. భీము డెప్పుడును వీనిని తలంచుకొనుచు దుర్యోధనునిపై కోప మెక్కించుకొను చుండెను. ధర్మజుడు ఈ పనుల నెన్నడును తలపక దుర్యోధనుడు తనతమ్ముడు గదాయని వానియందు దయయే వహించి యుండును. ధర్మజ భీమసేనుల శీల మింత భిన్నము. ఇన్ని మాటలు చెప్పినను ధర్మజునకు కోపము రాలేదు.

వ్యా: వనజ+అక్షి=వనజాక్షి—సవర్ణ దీర్ఘ సంధి
వనజములవంటి అక్షులు గలది—ఉపమాన పూర్వపద కర్మధారయ సమాసము.

తల+పట్టి=తలపట్టి—గసడదవాదేశము
ఒలువన్+పనిచె=ఒలువఁబనిచె } సరళాదేశ సంధి:
పనిచెన్+పుట్టిన్=పనిచెఁబుట్టిన
కేవలము+కరుణ=కేవలంపు కరుణ

సూ. కర్మధారయంబుల మువర్ణకమునకు పుంపులగు
కేవలంపు+న్+కరుణ=కేవలంపుఁగరుణ

సూ. సమాసంబుల ఉదంత స్త్రీ సమంబులకు, పుంపులకు
పరుష సరళంబులు పరంబు లగునపుడు నుగాగమంబగు.
కేవలంపుఁగరుణ=కేవలమైనటువంటి కరుణ—
కర్మధారయ సమాసము.

66. పూర్వ—వైర—స్మరణ- కలుషితుండు = వెనుకటి శత్రుత్వము యొక్క స్మరణచే కోపించినవాడు; సాంత్వన—వచన—పూర్వకంబుగా= ఓదార్పు మాటలతో గూడియుండునట్లు.

విశే: వెనుకటి వైరమును స్మరించి భీముడు కోపముచే మలినమైన మనస్సు కలవాడై సోదర స్నేహమును మఱచెను. ధర్మరాజు అజాతశత్రుడు గనుక ఆయన వైరము స్మరింపక కేవలము బంధుప్రేమచే దుర్యోధనుని పట్ల జాలిపడెను.

వ్యా: అజాత—శత్రుండు=పుట్టని శత్రువులు కలవాడు—
బహువ్రీహి సమాసము.

67. కరము=మిక్కిలి; చెనసి=పూని; ఉత్తమశూరుండు = మంచి వీరుడు.

తా: రక్షింపుడని యెవ్వరైన మొఱపెట్టినప్పుడు ఎంత బలహీనుడైనను చేతనైనంత సాయము చేయును. అట్టిచో దీనుల స్థితి చూచి ఉత్తముడైన వీరుడు ఊరకుండునా?

68. భీకర-శత్రుని = భయంకరుడైర విరోధిని; కరుణా—పరుల= దయయందాసక్తి గలవారిని; ఇరవుగ=స్థిరముగా,

తా: ఘోర శత్రువునైనను శరణని వచ్చినప్పుడు ప్రేమతో రక్షింపవలయును. ఇది దయావంతుల పద్ధతి. దీనికే ధర్మములును సాటిరావు.

వ్యా: భీకర-శత్రువు=భయంకరుడైన శత్రువు—
కర్మధారయ సమాసము

కరుణా—పరులు=దయయందు ఆసక్తులు—సప్తమీ
తత్పురుష సమాసము.

69. భవదీయ–బల-శౌర్యంబుల–పేర్మి=నీదైన బలముయొక్కయు ప్రతాపముయొక్కయు గొప్పతనము; బద్ధ+ఆశుడు = దృఢమైన ఆశగలవాడు (బహువ్రీహి); యజ్ఞ–దీక్షితుండను=యజ్ఞమందు దీక్షవహించినవాడను (సప్తమీ తత్పురుషము); ప్రియ పూర్వకంబుగా = ప్రియముతో; అనునయించి = శాంతపరచి; సామ–వచనంబులన్ = శాంతములైన మాటల చేత; తీరకున్నన్=సరికానిచో; ప్రతివీరులు=శత్రువీరులు; జన్నంబు = యజ్ఞము; ఆముక్త-కవచులు=ధరింపబడిన కవచములు గలవారు (బహువ్రీహి); ఆబద్ధ–తూణీరులు = బంధింపబడిన అమ్ముల పొదులు గలవారు (బహువ్రీహి), ఆకలిత–కార్ముకులు = కూర్చుకొనబడిన విండ్లు గలవారు (బహువ్రీహి), ఆరూఢ–రథులు=ఎక్కబడిన రథములు గలవారు (బహువ్రీహి); విచ్చర+అనీకంబున్ (సవర్ణ దీర్ఘ సంధి)=గంధర్వ (సేనను) సమూహమును;

విశే: కౌరవులు తమ్ము శరణు చొచ్చుటకు గారణము వారికి భీముని బలపరాక్రములపైగల విశ్వాసమే యని ధర్మరాజనుట భీముని ఉబ్బించి ఒప్పించుటకు శరణన్న శత్రువును రక్షించుట పుణ్యము కీర్తి కలిగించును ధర్మరాజు అట్టి యవకాశముల కొరకెదురు చూచుచుండును. ఎంతచెప్పినను భీముడు అంగీకరింపకుండుటచే ధర్మరాజు నేనే పోయియుందును. గాని యజ్ఞదీక్ష వహించి యున్నాను గనక నేను పోరాదు అనెను. తనచే భీము డట్టిపని చేయింపడని ఆయన యెఱుంగును. "నా చేయు జన్నంబు సఫలంబు సేయుడు" అని ధర్మరాజు 'దుర్యోధనుని రక్షించుట యనగా తన యాగమును సఫలము చేయుటయే' యనుచున్నాడు భీము డిప్పుడు కాదనుటకు వీలులేదు. కనుక ఇష్టములేకున్నను తప్పనిసరియై అంగీకరించెను భీము డంగీకరించినంత ధర్మజుడు అర్జునాదులను గూడ పొంచనెను. దుర్యోధనుని రక్షించుటకు ముందుగా భీమునే పొమ్మనుట ధర్మరాజు గడుసుదనము. ముందే యుద్ధమునకు దిగక సామవచనములతో యత్నింపు డనుట ఆయన స్వభావసిద్ధమైన రాజనీతి.

వ్యా: గంధమాదనంబునకై చనుచున్న = గంధమాదనమును గూర్చి చనుచున్న–లేక గంధమాదనమునకు చనుచున్న.

సూ: ఒకానొకచో నొక విభక్తికి మఱియొక విభక్తియునగు (కారకము)

నకులుండును సహదేవుడును–నకులసహదేవులు–ద్వంద్వము.

70. క్రమ్మఱి=వెనుదిరిగి, మరలి; అగ్ని–కాల్పులన్ = అగ్నితో సమానమైనవారిని (తృతీయ) తేజః+ధనులన్=తేజమే ధనముగా గలవారిని

(బహుప్రీహి); అమర+ఇంద్ర–సదృశుల = దేవేంద్రునితో సమానమైనవారిని. (తృతీయ); ప్రకటిత+ఆటోపమునన్=ప్రకటింపబడిన సంరంభముతో.

తా: గంధర్వులు వెనుదిరిగి యగ్నిసదృశులు, ప్రతాపధనులు, ఇంద్ర సమానులునైన పాండవులను జూచి గొప్ప పరాక్రమముతో ఎదిరించిరి.

విశే: పాండవులను వర్ణించు విశేషములే వారు విజయవంతులగుదురని తెలుపుచున్నవి. గంధర్వులకు పాండవులు దేవేంద్రునివలె తోచిరట. దేవేంద్రుడు గంధర్వాదులైన దేవజాతు లందరకును ప్రభువు.

7. అతి+ఉగ్రతన్ = మిక్కిలియైన తీవ్రతను; తక్కి = విడిచి; ప్రియ+ఉక్తులన్=ప్రియములైన మాటలతో (కర్మధారయము); విగ్రహము= వైరము; పార్థివ–ప్రాగ్రవరుండు=రాజులలో ముందు నడచువాడు (శ్రేష్ఠుడు); పన్పు=ఆజ్ఞ; అలంఘ్యము=జవదాటరానిది.

తా: అర్జును డప్పుడు అన్న గారి వాక్యములను దలచుకొని తీవ్రత విడిచి గంధర్వులతో ప్రియము నిట్లనెను. మీకు మాపట్ల వైరమేల; స్నేహ భావముతో దుర్యోధనుని విడువుడు. రాజాగ్రేసరుడైన ధర్మజునియాజ్ఞ యిది. ఇప్పుడు మాకు జవదాటరానిది.

విశే: గంధర్వులతో ముందు సామముగా వ్యవహరింపుడని ధర్మజుడు చెప్పిన మాటను గుర్తుతెచ్చుకొని అర్జునుడు యుద్ధముతో పనిలేకుండ గంధర్వులనుండి దుర్యోధనుని విడిపింపఁ జూచెను.

వ్యా: అతి+ఉగ్రత=యణాదేశసంధి
ప్రియ+ఉక్తులన్=ప్రియోక్తులన్=గుణసంధి
ఈ+తఱిన్=ఇత్తఱిన్=త్రికసంధి.

72. —

విశే: "దుర్యోధనుని విడిపించుకొని రమ్మని ధర్మజుడు మాకు ఆజ యిచ్చెను. అతని యాజ్ఞ మాకు మీరరానిది. వైర మేల? దుర్యోధనుని విడువుడు" అని పార్థుడు శాంతముగా పలికినను గంధర్వులకు రోషమే కలిగినది.

73. అనిమిష+ఇంద్రుడు (గుణసంధి)=దేవేంద్రుడు; శాసింప= ఆజ్ఞాపింప, ఒడయడు=ప్రభువు.

తా: ధర్మరాజు మాకు ప్రభువా? ఆ ధర్మరాజునాజ్ఞ మే మేల చేయ వలెను; దేవేంద్రు డొక్కడే మమ్మాజ్ఞాపింపగల ప్రభువు. ఇతరు లెవ్వరైనను మా కేమి భయము.

విశే: గంధర్వులు సామవాక్యములు పల్కినప్పుడు దుర్యోధనుని ఛీటు లిప్తే మాట్లాడిరి. అహంకరించి పోరి గంధర్వుల కోడిపోయిరి. ఇప్పుడు గంధర్వులు పాండవుల సామవాక్యములకు గర్వముతో బదులాడుచుండిరి. కౌరవులకంటె గంధర్వులు, గంధర్వులకంటె పాండవులు శాంతులు, నిరహంకారులు నని భావము.

74 వివ్వచ్చుడు=అర్జునుడు; ఉపలక్షించి=చూచి; తెగువకు= సాహసమునకు; సామ–సాధ్యులరు=సామముచే సాధింపదగినవారు; నిశిత–విశిఖ–ప్రకరంబులు=పదునైన బాణముల సమూహములు; పటు – బాణ–వర్షంబులు=తీవ్రమైన యమ్ముల వానలు; అనేక-గంధర్వ–శత–సహస్రంబులతో=అనేకమైన గంధర్వులయొక్క వందల వేలతో; అతి–ఘోర–సమరంబు=మిక్కిలి భయంకరమైన యుద్ధము.

విశే: పాండవులు నలుగురే గంధర్వులతో యుద్ధము చేయసాగినారు. వారివెంట వచ్చిన కౌరవ సైనికులు గంధర్వులధాటి చవిచూచి యున్నవారు గావున భయపడి యూరకుండిరని తలంపవలెను.

వ్యా: విడిపించు+దు=విడిపింతు–దుగ్ధకారసంధి.

ఆ+వియచ్చరులు–అవ్వియచ్చరులు–త్రికసంధి.

75. కదిసి=సమీపించి; తేరు=రథము; భగ్నముగా=పగులునట్లు; పెల్లు+ఒదవి = ఎక్కువగా పుట్టి; ఖేచర-కోటి = గంధర్వ సమూహము; పురందర–నందనుండు = ఇంద్రుని కొడుకైన యర్జునుడు; అదయుడై = భయములేనివాడై; ప్రళయ+అగ్ని–కల్పులన్=ప్రళయకాలమందలి యగ్నులతో సమానమైన వారిని; కదన–శూరులన్=యుద్ధమందు పరాక్రమవంతులైనవారిని; నిర్దహించెన్=కాల్చివేసెను; ప్రకాండ-దివ్య-శర+అర్చులన్ = గొప్పవయిన దివ్యబాణము లనెడి జ్వాలలనిన.

తా: అర్జునుని రథమును భగ్నముచేయు తలపుతో ఒక్కుమ్మడిగా గంధర్వులు పలువురు మూగగా ఆతడు దయమాలి తన దివ్యాస్త్రముల మంటలచే ప్రళయాగ్ని సమానులు, రణశూరులైన పది లక్షలమంది గంధర్వులను దహించివైచెను.

విశే: ధర్మరాజు దుర్యోధనుని రక్షింపుమని ముందుగా భీమునే ప్రోత్సహించినను అతడు యుద్ధమునకు అనిష్టముగా వెడలెను. యుద్ధమున ఉత్సాహముతో పాల్గొనుచున్నట్లుకూడ కానరాదు. యుద్ధమునందు అర్జునునకే ప్రాధాన్యము

కనబడుచున్నది. గంధర్వులతో తొలుత మాట్లాడినది అర్జునుడే. తొలుత బాణ పరంపర ప్రయోగించినది ఆతడే. అతనిని గంధర్వులందఱు చుట్టుముట్టిరి. అర్జునుడు దివ్యాస్త్రములు ప్రయోగించి యొక్క త్రుటిలో పదిలక్షల మంది గంధర్వులను దహించి వైచెను.

వ్యా: కదన-శూరులన్=యుద్ధమందు శూరులను—

సప్తమీ తత్పురుష.

ఖేచర కోటి=ఖేచరుల సమూహము } షష్ఠీతత్పురుషము.
పురందర నందనుండు=ఇంద్రుని యొక్క కొడుకు

ఛందస్సు: తరలవృత్తము.

గణములు: న భ ర స జ జ గ.

యతి: 12వ అక్షరము
ప్రాసనియమము కలదు.

76. ఘన కోదండ+ఉగ్ర-మౌర్వీ-క్వణము = గొప్పదైన విల్లు యొక్క భయంకరమైన అల్లెత్రాటి మ్రోత, అఖిల - నభస్+గహ్వర+ అభోగ భాగంబున=సమస్తమైన ఆకాశమనెడి గుహయొక్క విస్తారమైన ప్రదేశమున; అపూర్ణంబుగాన్=అంతటను నిండగా; ఉబ్బున= ఉత్సాహముతో; కవలున్=నకుల సహదేవులును; మరుత్+పుత్రుండు = వాయుపుత్రుడైన భీముడు; తీవ్ర-నారాచ-నితాంత+అపాత - లీలా-సరభస-గతులై=చురుకైన బాణముల పాతముల విలాసముచే త్వరలో గూడిన నడకలు గలవారై, శత్రు వీర-వ్రజంబున్ =శత్రువులైన వీరుల సమూహమును, తునుమన్=నరుకగా తత్+శోణితంబున్=వారి రక్తములు, తొరలి=కారి; మడువులై =చెఱువులై తొటెన్=నిండెను, ఆ+యుద్ధభూమిన్=ఆ యుద్ధరంగమునందు.

తా: గొప్ప వింటినారి మ్రోత ఆకాశ ప్రదేశమంతయు వ్యాపించు చుండగా నకుల సహదేవులు, భీముడు ఎడతెగని బాణములను ప్రయోగించుచు, త్వరితముగా శత్రువీరులను నరుకగా వారి నెత్తురు రణరంగమున చెరువులై నిండిపోయెను.

విశే: "కవలు మరుత్పుత్రుండున్" అనుటచే నకుల సహదేవులే భీమునికంటె యుద్ధమునం దుత్సాహములో ముందడుగు వేయుచుండిరని తెలియును. అర్జునుడు దివ్యాస్త్రములను సంపాదించినాడు గనుక ఆగ్నేయాద్యస్త్రములను ప్రయోగించి గంధర్వులను దహించెను. భీమ నకుల సహదేవులు సాధారణములైన బాణములచే శత్రువులను సరుకుచుండిరి. పాండవుల యుద్ధవిధానము అసాధారణమైనదని సూచించుటకు ఇచ్చట తరలము, మహాస్రగ్ధర యను విశేషవృత్తములు వాడబడినవి. అర్జునుని యుదమున కొక్కడానికి ఒక తరలము. భీమ నకుల సహదేవులు మువ్వురు యుదమునకు ఒక మహాస్రగ్ధర వాడుటచే అరునుని యుద్ధము ప్రత్యేకముగా వర్ణింపదగినంత గొప్పదని సూచన.

వ్యా: కోదండ + ఉగ్ర = కోదండోగ్ర — గుణసంధి.

గహ్వర + ఆభోగ = గహ్వరాభోగ | సవర్ణదీర్ఘ సంధి
నితాంత + అపాత = నితాంతాపాత |

తత్ + శోణితంబుల్ = తచ్ఛోణితంబుల్
తత్ + శోణి; తచ్ + శోణిత - శ్చుత్వాదేశము
తత్ + శోణిత - తచ్ త + ఛోణిత ఛత్వాదేశము —
తచ్ఛోణితంబుల్

వారి యొక్క శోణితములు షష్ఠీతత్పురుషము

అలంకారము : అతిశయోక్తి.

ఛందస్సు : మహాస్రగ్ధరావృత్తము.

గణములు : స త త న స ర ర గ.

యతి : 9వ, 16వ అక్షరములు.
ప్రాసనియమము కలదు.

71. కౌంతేయులు = కుంతీ పుత్రులు, పాండవులు; చెఱలు = బంధములు, ఏమఱక = అశ్రద్ధచేయక. ఉంకించినన్ = ప్రయత్నింపగా, సవ్యసాచి = అర్జునుడు, అతి-నిబిడ-బాణ-జాలంబులు = మిక్కిలి దట్టమైన బాణము లనెడి వలలు (బాణముల సమూహములు), దిక్ + నభస్ + మార్గంబులు = దిక్కులయొక్కయు, ఆకాశముయొక్కయు త్రోవలు. నీరంధ్రంబులు =

రంధ్రములు లేనివిగా; ఆ+గగనచరులు = ఆ గంధర్వులు; పులుగులు = పక్షులు; శర-పంజరము=బాణములయొక్క వల; ఉక్కు=బలము; వివిధ+ఆయుధ-పరంపరలు=అనేక విధములైన ఆయుధముల వరుసలు.

విశే: పాండవుల విజృంభణమును తట్టుకొనజాలక గంధర్వులు రణరంగమునుండి తప్పించుకొని పోఁజూచిరి. వారు పారిపోయినచో అర్జునునకు అభ్యంతరము లేదు. కాని దుర్యోధనుని చెఱలు విడువకుండ వానిని దీసికొనియే గంధర్వులు తప్పించుకొని పోఁజూచిరి. అది కనిపెట్టి అర్జునుడు దిక్కులను ఆకాశమును బాణపు వలలచే గప్పివైచెను. గంధర్వులు వలలో చిక్కినపక్షులై పోయిరి. అర్జునుడు సవ్యసాచి, అనగా రెండు చేతులంతో బాణములు ప్రయోగింపగలడు, కనుక వేగముగా బాణములు ప్రయోగించి చిక్కనివల అల్లెను. గగనచరులయిన గంధర్వులను పులుగులతో బోల్చుట సరసముగా నున్నది.

వ్యా: దుర్యోధన+ఆదులు=దుర్యోధనాదులు—సవర్ణదీర్ఘసంధి.
దుర్యోధనుడు మొదలుగాగలవారు—బహువ్రీహి సమాసము.
దిక్+నభస్=దిఙ్నభస్—అనునాసిక సంధి.
దిక్కులు, ఆకాశమును-ద్వంద్వసమాసము.
నభస్+మార్గంబులు=నభో మార్గంబులు—అసంత సంధి.
ఆకాశముయొక్క మార్గములు—షష్ఠీతత్పురుషము.
ఆ+గగనచరులు=అగ్గగనచరులు-త్రికసంధి.
గగనచరులు=గగనమునందు చరించువారు—సప్తమీతత్పురుష.
శరపంజరము=శరములయొక్క పంజరము—షష్ఠీసమాసము.
శరములనెడి పంజరము—రూపకసమాసము

అలంకారము: శరపంజరము అనుచోట రూపకము
వలలోనం జిక్కిన పులుగులుంబోలె-ఉపమ.

78. క్రీడి=అర్జునుడు; అవి+ఎల్లన్ = ఆ యాయుధములన్నియు; తునుమాడి=త్రుంచి; ఘన=గొప్పదైన; రోష=కోపముచేత; అభీలుడు+ఐ=భయంకరుడై; శాత = పదునైన; భల్ల = బాణములయొక్క; వితానంబు = సమూహమును; అడరింపన్=ప్రయోగింపగా; తలలు=శిరములు;

డొల్లన్=రాలిపడగా; కాయముల్ = శరీరములు; మింటనుండి = ఆకాశము నుండి; వడిన్=వేగముగా; కుంభినిన్=భూమిమీద; కూలగా=పడగా; రుధిర-వృష్టిన్=నెత్తుటి వర్షముచేత; కాలువల్=కాలువలు; పాఱగాన్= ప్రవహింపగా; జగము=ప్రపంచము; ఉద్వేగంబునున్ - పొందగా=భయో ద్రేకము పొందగా; దివిన్= ఆకాశమునందు; గంధర్వులు=గంధర్వులయొక్క; క్రందు=సందడి; అడంగెన్=తగ్గిపోయెను, నశించెను.

తా: గంధర్వులు ప్రయోగించిన వివిధాయుధములను త్రుంచి యర్జు నుడు పదునైన బాణములను ప్రయోగించినంత తలలు రాలిపడి, శరీరములు నేలగూలి, రక్తవర్షముచే కాలువలు ప్రవహించి ప్రపంచము భయావేశము పొందునట్లుగా ఆకాశమున గంధర్వుల సందడి యణఁగిపోయెను.

విశే: తాను ప్రయోగించిన బాణముల వలలో చిక్కియు గంధర్వులు ఆయుధములు ప్రయోగింప మానకుండుట చూచి యర్జునుడు గొప్ప రోషము పొందెను. ఆ యాయుధములు నరకుటయే కాక ఆకాశమున కెగిరి పోవుచున్న గంధర్వుల శిరస్సులు కూడ నఱికి వైచెను. తలలు మొండెములు నేలరాలెను. వారి నెత్తురు వాన కురిసెను. అంతకు పూర్వమే యుద్ధరంగమున నెత్తురు చెఱువు లేర్పడి యుండెను. ఈ నెత్తురు వానచే ఆ చెఱువులు నిండి పొర్లి నెత్తురు వాగులు ప్రవహించెను. పలువురు గంధర్వులు చచ్చుటచే ఆకాశమున వారి సందడితగ్గెను. గంధర్వులు ప్రాణమున్నంతసేపు ఆకాశమున నెగురగలరు. ప్రాణము పోయినంతనే నేలపైబడి పోదురు. గంధర్వులతోడి యుద్ధము అర్జు నునకు పిట్టలవేటలవలె ఉండెనని యిచ్చటి యుపమాన రూపకమువల్ల వ్యక్త మగుచున్నది.

అలంకారము: అతిశయోక్తి.

వ్యా: అవి+ఎల్లన్=అవి యెల్లన్-యడాగమము.

రోష+అభీలుడు=రోషముచేత భయంకరుడు-సవర్ణ దీర్ఘ సంధి; తృతీయా తత్పురుష సమాసము.

వడిన్+కుంభిని=వడింగుంభిని } సరళాదేశసంధి.
ఎల్లన్+తునుమాడి=ఎల్లందునుమాడి }

కాలువల్+పాఱగా=కాలువల్ వాఱగా - గసడదవాదేశము

రుధిరవృష్టి=రక్తముయొక్క వాన-షష్ఠీతత్పురుషము.

ఛందస్సు: మత్తేభవిక్రీడిత వృత్తము

గణములు: స భ ర స మ య వ

యతి: 14వ అక్షరము

ప్రాస నియమము కలదు.

†సమగ్రవ్యాఖ్యకు ముఖ్యము.

79. అర్జున—ప్రయుక్తంబు = అర్జుననిచే ప్రయోగింపబడినది (తృతీయా తత్పురుష); ఆగ్నేయ+అస్త్రంబు=అగ్నిదేవతాకమైన అస్త్రము (సవర్ణ దీర్ఘ సంధి); దావ+అగ్ని=అరణ్యసంబంధమైన అగ్ని (సవర్ణ దీర్ఘ సంధి; కర్మధారయము); నీరస-విపినంబు=ఎండిన యడవి (కర్మధారయ); గంధర్వ - నివహంబు=గంధర్వుల సమూహము (షష్ఠీ సమాసము); నీఱు =బూడిద; భీమసేన + అనుజుమీద =భీముని = తమ్ముడైన అర్జునునిమీద (సవర్ణ దీర్ఘ సంధి; షష్ఠీ తత్పురుష); పటు-గదా-దండంబు=గట్టిదైన గద; మాయా+బలంబు=మాయయొక్క శక్తి (షష్ఠీతత్పురుషము); అంతర్హితుడు =కనబడకుండ పోయినవాడు.

విశే: అర్జునుడు ఆగ్నేయాస్త్రము ప్రయోగించి మిగిలిన గంధర్వులను గూడ దహించుచుండగా గంధర్వ రాజునకు గోపము వచ్చెను. బాణములను ప్రయోగించి అతనినేమియు చేయజాలక అతనిపై పెద్ద గదను ప్రయోగించెను. గదయందు భీముడు నేర్పరి. అర్జునుడు ధనువునందే నేర్పరి. భీమసేనానుజుడు' అని యర్జునునిగూర్చి చెప్పుటచేత గదయందు నేర్పుగలవాని తమ్ముడు అను నర్థము, అగస్త్యభ్రాత అను సూక్తి వ్యక్తమగుచున్నది. ఆ గదను బాణబలముచేత అర్జునుడు ఏడు ముక్కలుచేసెను. గంధర్వరాజు ఇక లాభము లేదని తన మాయాశక్తిని ప్రదర్శింపబూనెను. కౌరవులు పెద్దసేనతో వచ్చుటచేత చిత్రసేనుడు ముందే మాయాయుద్ధ మారంభించెను. పాండవులు నలువురే వచ్చుటచేత చిత్రసేనుడు మాయాశక్తిని ముందే చూప యత్నించలేదు. ఇప్పుడు వారి బలము తెలిసివచ్చుటచేత గత్యంతరము లేక మాయాయుద్ధమునకు బూనుకొనెను.

80. పార్థులన్=పృథ (కుంతి) యొక్క కొడుకులను; అతి+ఉజ్జ్వల- శర- వర్షములన్ = మిక్కిలి ప్రకాశవంతములైన బాణముల వర్షములందు; జలధరము-క్రియన్ = నీటిమేఘమువలె; వెలుచనన్=నిర్లక్ష్యముగా; ఉక్కలుడు=బలముగలవాడు, సమర్థుడు; కడక=పూనిక.

తా: గంధర్వరాజు నలుగురు పాండవులను వాడి బాణముల వర్షములందు ముంచి నీటితోనిండిన మేఘములవలె గర్జిల్లుచు బలశాలియై తన పరాక్రమమును పూనికను చూపెను.

విశే: చిత్రసేనుడు మేఘమండలము చాటున నిల్చి మేఘమువలె గర్జిల్లుచు వాడి బాణము లనెడు వర్షము కురిపించి నల్వురు పాండవులను ముంచియె త్తెను. బాణవర్షముచేత అర్జునుని అస్త్రాగ్నిని చల్లార్పవలెనని యత్నించెను. కాని యిట్టి బాణవర్షము అర్జునునకు లెక్కలేదు.

అలంకారము : రూపకము — అత్యుజ్జ్వలశరవర్షము అన్నచోట. ఉపమ— జలధరముక్రియన్ అన్నచోట శ్లేష. శరవర్షము = బాణ వర్షము. జలవర్షము; శరము=బాణము, జలము.

81. ఉరక=లెక్కచేయక; శబ్ద — వేధులు=శబ్దమునుబట్టి ప్రసరించునట్టివి; నాయకములు=బాణములు; సర్వ - గాత్రంబు=సర్వమయిన శరీరము; మాత్రలోన—రెప్పపాటులో; ఉడిపె=ఆపెను; కడక=పూనిక.

తా: ఇంద్రుని కుమారుడైన యర్జునుడు ఆ శర వర్షమును లక్ష్యపెట్టక శబ్దము ననుసరించి ప్రసరించు బాణములచేత చిత్రసేనుని శరీర మంతయు పగులునట్లుచేసి ఒక్కక్షణములో ఆతని పూనిక యంతయు నిలిపివేసెను.

విశే: చిత్రసేనుడు మేఘమండలము మాటున నుండుటచే కనబడుట లేదు. కాని అతడు ఉత్సాహమున గర్జిల్లుచుండుటచేత ఆ శబ్దమునుబట్టి అత డున్న దిక్కు తెలియవచ్చుచుండెను. శబ్దము వినవచ్చు దిక్కునబోయి శబ్దము చేయుచున్న వస్తువును భేదించు ప్రత్యేకములయిన బాణములను అర్జునుడు ప్రయోగించి ఆతని శరీరమంతయు తూట్లుపడునట్లు చేసెను. అర్జునుడు చిత్రసేనుడు మిత్రులే కనుక ఆతనిని అర్జునుడు చంపదలపలేదు. అర్జునుని గూర్చి

యుచ్చట 'ఇంద్రసూనుడు, గాండీవి' అన్న మాటలు ప్రయోగింపబడినవి. ఇవి మిక్కిలిసార్థకములు. అర్జునుడు ఖాండవమును దహించిన సందర్భమును ఇవి సూచించుచున్నవి. అగ్నిదేవుని ప్రార్థనపై అర్జునుడు అగ్నిచే ఖాండవము దహింపజేసెను. ఆ వనము ఇంద్రునిదగుటచే ఇంద్రుడు అగ్నిపై పెద్దవర్షము కురిపించెను. అప్పు డర్జునుడు అగ్నిదేవుడిచ్చిన గాండీవము అను ధనువు బలమువల్ల ఆకాశమున బాణములచే పందిరికట్టి ఇంద్రునివర్షమును ఆపి అగ్నిచే ఖాండవ దహనము చేయించెను. ఇంద్రసూనుడు అన్న పదమువల్ల ఇంద్రునివర్షమునే అడ్డగించినవాడు అన్న అర్థమువచ్చి చిత్రసేనుని బాణ వర్షమును అడ్డగించుట యొక లెక్కలోనిదికాదు అని స్ఫురించును. గాండీవి అన్న శబ్దముకూడ ఆ యంశమును బలపఱచును.

82. రణ-సంరంభంబు=యుద్ధ ప్రయత్నము; పొడ=ఆకారము; ఆత్మ-సఖుండు= తన మిత్రుడు; ఖేచర-పతి=గంధర్వరాజు; సంహృత+అస్త్రుండు=ఉపసంహరింపబడిన యస్త్రముగలవాడు; వృకోదర+ఆదులు= భీముడు మొదలుగాగలవారు; సమర-విరామంబు=యుద్ధము మానుట.

విశే: అర్జునుడు కాలకేయాది రాక్షసులనుజంపి స్వర్గమునకేగి ఇంద్రుని యర్ధాసనమున గూర్చుండెను. ఆ సందర్భమున చిత్రసేనాదులు ఆతనికి మిత్రు లయిరి. శబ్దవేధులైన బాణములచేత తూట్లు పడిన మిత్రుని శరీరము చూచి యర్జునుడు జాలిపడెను. అందరును యుద్ధము చాలించి కుశలము లడిగికొనిరి,

83. వీర+ఉత్తమ = వీరులలో శ్రేష్ఠుడా; కౌరవ - ప్రకరము= కౌరవుల సమూహము; తత్+దారా+అనుజ-సుత-సమన్వితంబుగ = ఆతని భార్యలు, తమ్ములు, కుమారులతో గూడియుండునట్లు.

తా: వీరోత్తముడైన చిత్రసేనా, కౌరవులతో నీకి వైరము తగునా? ఈ కౌరవరాజును, అతని భార్యలను, తమ్ములను, కొడుకులను విడిచిపెట్టుము.

విశే: తనచే ఓడిన గంధర్వరాజును పార్థుడు 'వీరోత్తమ' అని సంబో ధించుట ఆతని యుదాత్తతకు గుర్తు. అల్పకారణముచేతకౌరవ రాజును ఈ విధముగా బంధించుకొని పోవునంత వైరము కూడదు అని పార్థుని మందలింపు.

వ్యా: వీర+ఉత్తమ=వీరోత్తమ-గుణసంధి.
వీరులలో శ్రేష్ఠుడా—షష్ఠీతత్పురుష సమాసము.
ఈ+మెయి=ఇమ్మెయి-త్రికసంధి; కర్మధారయము.

85. నితాంత+ఆయాస-పీడితులు=ఎడతెగని శ్రమచేత బాధింపబడినవారు; పరమ—ధర్మ+ ఆత్మలన్ = గొప్ప ధార్మికమైన మనస్సుగలవారిని; భార్యా-సమేతులన్=భార్యతో గూడియున్నవారిని (తృతీయా తత్పురుషము); అపహసింపన్=వెక్కిరించుటకు; సుర+ఇంద్రుడు=దేవేంద్రుడు కలుషించి=కోపించి; అనుజ-వధూ-సహాయ + అన్వితముగా = తమ్ములు భార్యలు, మిత్రులతో గూడియుండునట్లు; పాప-వర్తనున్=పాపమైన నడవడి గల వానిని (బహువ్రీహి); శక్రు—పాలికి = ఇంద్రుని వద్దకు; ఒండు= వేఱు; మత్-సుఖుండవు=నాయొక్క మిత్రుడవు (షష్ఠీసమాసము); మత్సరంబు=ద్వేషము; అలుకయు=కోపమును.

తా: ఈవనమున శ్రమపడుచు భార్యాసహితులై యున్న ధర్మపరులైన మిమ్ము వెక్కిరింపవలెనని యీ దురాత్ముడు ఇచ్చటికి వచ్చినాడు. ఈ సంగతి తెలిసి దేవేంద్రుడు కోపించి తమ్ములతో, భార్యలతో, మిత్రులతో గలిపి యీ పాపాత్ముని బంధించి కొనితెమ్మని నాకు ఆజ్ఞయిచ్చెను. అర్జునా! వినుము. వీని నిప్పుడే యింద్రునివద్దకు దీసికొని పోవుచున్నాను. నీవువేరేమియు చెప్పకుము ఇంక నిలుపుము. నీవు నాకు చెలికాడవు గనుక నీయందు నాకు ద్వేషముగాని కోపముగాని లేదు.

విశే: దుర్యోధనాదుల దురాలోచనలను దివ్యశక్తిచే నెఱికగిన యింద్రుడే ఈ పన్నుగడ యంతయు పన్నెను. సరోవరమున గంధర్వరాజు క్రీడించుట కల్పన. కౌరవులతో కలహము పెట్టుకొనుట కిది యుపాయము పాండవులకు శ్రమలేకుండ ఇంద్రుడే గంధర్వులచేత దుర్యోధనునకు బుద్ధిచెప్పింప దలచెను. భార్యాసమేతులైన మిమ్ము అపహసింప వచ్చినాడు గనుక భార్యాసమేతముగా బంధిపుమని ఇంద్రుని యాజ్ఞ. మనకు ఈ యుద్ధము ద్వేషమువల్ల వచ్చినది కాదు. ఇంద్రుని యాజ్ఞ నిర్వర్తించుటకు మేమును, ధర్మజునియాజ్ఞ నిర్వర్తించుటకు మీరు పూనినందున ఈ యుద్ధము ఏర్పడినది. కనుక నీవు అభ్యంతరము చెప్పకుము. వీని నిప్పుడే యింద్రుని వద్దకు దీసికొని పోవుదును. ఇట్లని చిత్రసేనుడు తన ప్రభువు నాజ్ఞ నిర్వర్తించు పూనిక విడువక పార్థునితో చల్లగ మాటలు పలికెను.

వ్యా: ఈ+వనంబున=ఇవ్వనంబున–త్రిక సంధి.

నితాంత+ఆయాస+నితాంతాయాస } సవర్ణ దీర్ఘ సంధి
ధర్మ+ఆత్ములు=ధర్మాత్ములు }

సహాయ+అన్వితముగా=సహాయాన్వితముగా

సుర+ఇంద్రుడు=సురేంద్రుడు–గుణసంధి

86. సహ+ఉదరుండు=తోబుట్టువు (గుణసంధి); కర్జము=కార్యము; ప్రమోదంబు+చేత=సంతోషము కలిగించుట.

తా: గంధర్వరాజు పలుకు విని అర్జునుడు ఇట్లనెను — వినుము. ఈ దుర్యోధనుడు మాకు సహోదరుడు. కనుక వీనిని నీవు విడుచుట కార్యము. ఇదియే ధర్మరాజునకు గొప్ప సంతోషము కలిగించును.

విశే: నీవు నాకు సఖుడవు కాని ఈ సుయోధనుడు మాకు సోదరుడు. సఖ్యముకొరకై సోదరుని విడువజాలను. నాకు సఖుడవు గనుక నీవే నా సోదరుని విడుచుట ధర్మము. "వినవె" అని చిత్రసేనుడు అనగా "వినుము" అని పార్థు డనెను. వీనిని బంధించుకొనిపోవుట ఇంద్రున కిష్టమైనచో వీనిని బంధవిముక్తుని చేయుట ధర్మరాజున కిష్టము. ఇంద్రుడైనను ధర్మరాజు సంతోషము కొఱకేకదా వీనిని బంధించి తెమ్మనెను. నీవు వీనిని విడిచినందు వల్లనే ధర్మరాజునకు సంతోషము అతిశయముగా కలుగును. గనుక వీనిని బంధించి తేలేదని యింద్రుడు నిన్నేమియు దండింపడు లెమ్ము అని పార్థుడు చిత్రసేనునకు నచ్చజెప్పెను; దుర్యోధనుని విడిపించి తమ యన్నయాజ్ఞను నిర్వర్తింపవలెనని పార్థుని పట్టుదల.

87. అమర–వరేణ్యు=దేవేంద్రుని యొక్క; ధర్మ –మహితుడు= ధర్మముచేత గొప్పవాడు (తృతీయా తత్పురుష); సమక్షమున = ఎదుట; క్రమమున=విధముగా; గైకొని=అంగీకరించి; మత్+ప్రియ+అర్థము=నా యొక్క ప్రీతికొఱకు;

తా: దేవేంద్రుని యాజ్ఞయైనను, ఆ మీద ఎవ్వరి యాజ్ఞయైనను నీవు మాత్రమిప్పుడు ' ధర్మరాజు సమక్షమునందా విషయము నెఱింగించి ఆయన ఏ విధముగా నేమి చేయుమని చెప్పునో అట్లుచేయుము. నా ప్రీతి

కొఱకై ధర్మజుని వద్దకు రమ్మ అని యర్జును డనగా చిత్రసేనుడు అంగీక రించి—

విశే: ధర్మరాజు మాకు ప్రభువా ? ఇంద్రుడే మా ప్రభువు. ఆయన పనుపున మేము దుర్యోధనుని బంధించి కొనిపోవుచున్నాము అని చిత్రసేను దన్నమాటలను బట్టి యర్జునుడు దేవేంద్రుని యాజ్ఞయైనను, ఆ మీద నెవ్వని యాజ్ఞయైనను నాకు లెక్కలేదు. ధర్మజుని యాజ్ఞనాకు ముఖ్యము. ఆయన దుర్యోధనుని విడిపింపుడని మాకు చెప్పినాడు; నీ వాయన వద్దకు వచ్చి ఆయన చెప్పినట్లు చేయుము. నాకు ప్రీతి చేయుము అని స్వాభిమానము, మిత్రప్రేమ ప్రకటించుచు అర్జునుడు పలికినాడు. చిత్రసేనుడు కాదనలేక అంగీకరించి నాడు.

వ్యా: ఏ+అది=ఏయది–ఎయ్యది.

యడాగమసంధి-త్రికసంధి

ఎద్ది+చెప్పు=ఎద్దిసెప్పు–గసడదవాదేశము.

ప్రియ + అర్థము=ప్రియార్థము–సవర్ణదీర్ఘసంధి

88. అతి-ప్రియంబునన్=మిక్కిలి ప్రేమతో; పూజించి=సత్క రించి; స + అనుజ+అమాత్యుండు=తమ్ములతో, మంత్రులతో గూడినవాడు; మా కుంగా=మాకొఱకు; ఆమంత్రణంబు=సెలవు తీసికొనుట, వీడ్కోలు; నివేదించు=విన్నవించు; సమర-నిహతులు = యుద్ధమున చంపబడినవారు; అమృత-వృష్టి=అమృతముయొక్క వర్షము; యుధి-స్థిరుండు = యుధిష్ఠి రుండు=యుద్ధమున స్థిరుడైనవాడు; బంధమోక్షణంబు=బంధము నుండి విడుదల;

విశే: ధర్మరాజు గొప్ప నేర్పరి. తన తమ్ములతో నోడిపోయిన చిత్రసేనునిగూడ ప్రేమతో సత్కరించెను. వైరమన్న మాటయే ఆయనకు నచ్చదు. చిత్రసేనుని మహాత్మా ! యని సంబోధించుటయు నేర్పే. ఈ దుర్యో ధనుడు సపరివారముగా నీచేత హతుడు కాలేదు. అది మా యదృష్టము. నీవు సుజనుడవు గనుక వీనిని బంధించితివి. అందువల్ల మాకు వంశహానిజరుగలేదు. వీడు చేసిన యపరాధముల నెన్నింటినో మేము సహించితిమి. మమ్ములను

చూచి నీవు వీని యపరాధము క్షమింప వలయును. మా కోసము వీనిని విడువ వలయును. ధర్మరాజిట్లు శాంతముగా, తియ్యగా పలుకగా చిత్రసేనుడు దుర్యోధనాదులను విడిచిపెట్టి స్వర్గమునకు బోయెను. అమృతవర్షము గురిసి చచ్చిన గంధర్వులను ఇంద్రుడు బ్రదికించెను. చచ్చిన కౌరవులట్లే చచ్చిరి. గంధర్వులకు పట్టుపడుటయే కాక, పాండవులచే బంధముక్తుడగుటయు దుర్యోధనునకు చచ్చినట్లయ్యెను. "మీ చేత వధియింపఁబడకునికి మేలయ్యె" అన్నమాటలో వీనిని భీముడు తొడలు విఱుగగొట్టి చంపవలసియున్నది. నీవే చంపినచో భీముని ప్రతిజ్ఞ వ్యర్థమయ్యెడిది. నీవు చంపకుండుట మంచిపనియైనది అన్న గూఢమైన యభిప్రాయమును ఊహింపవచ్చును. "మాకుంగా వీనిని విడువ వలయు'' నన్నమాటయందును ఇట్లే యూహింపవచ్చును. ధర్మరాజు స్వహస్తములతో దుర్యోధనుని బంధముక్తుని గావించెను.

వ్యా : సమర-నిహతులు=సమరమునందు హతులైనవారు—
సప్తమీ తత్పురుష సమాసము.
బంధ—మోక్షణము=బంధమువలన మోక్షణము—
పంచమీ తత్పురుషము.

89. దుర్జనుడు=చెడుమనిషి; అన్నున=ఒడలు తెలియక; సాహస-క్రియలయందు=తొందరపాటు పనులందు; కడంగి=పూని; క్రన్నన=శీఘ్రముగా: ఇమ్ములన్=స్వేచ్ఛగా, ప్రీతితో; వీటికిన్=పట్టణమునకు; సన్నుత=సజ్జనులచే కొనియాడబడినవాడా; ఒండొక=ఏమాత్రము.

వచ్చితివి. ఈ గండమెట్లో గడచినది. ఇంక స్వేచ్ఛగా నగరమునకు పొమ్ము. నీ యాటలు అక్కడ సాగును గాని ఇక్కడ కాదు అని గూఢమైన మందలింపు అన్యాపదేశముగా దుర్జనుడన్న మాటకు విరుగుడుగా సన్నుతః అని సంబోధన దీనికి మనస్సులో చింతపడబోకుము అనుట దుర్యోధనుడు అభిమానవంతుడని యెఱిగియుండుటవల్ల. వచ్చిన పని తలక్రిందైనది పాండవులను పరాభవింప వలెనని వచ్చి తానే పరాభవము పొందినాడు. ఎవరు దుర్బలులని తాను భ్రమ పడెనో వారే తనకంటె ఎన్నోరెట్లు బలవంతులని తేలినది. గంధర్వులు కట్టి వైచిన దానికంటె పాండవులు విడిపించినది దుర్యోధనునకు గొప్ప అవమాన కారణమయ్యెను. తాను వారిని అవమానింపగా వారు తన్ను ఈ విధముగా సమ్మానించిరి. దుర్యోధనునకు పశ్చాత్తాపము, దుఃఖము గలిగినవి.

90. దీన+ఆననుండు=దీనమైన ముఖము గలవాడు (సవర్ణదీర్ఘసంధి, బహువ్రీహి సమాసము); అనుజ-సహితుండు = తమ్ములతో గూడినవాడు; ధౌమ్య+ఆది-భూసురులు=ధౌమ్యుడు (పాండవుల పురోహితుడు) మొదలుగా గల బ్రాహ్మణులు; తత్+ఆశ్రమ-వాసులు = ఆ యాశ్రమమునందు వసించు వారు.

విశే: పాండవులు చేసిన మంచిపనికి ఆశ్రమవాసులందరును వారిని పొగడిరి. బ్రాహ్మణుల సంతోషమే పాండవులకు గొప్ప ఆశీర్వచనము

వ్యా: తత్+ఆశ్రమ=తదాశ్రమ-సంస్కృత సరళాదేశము.
ఆశ్రమ-వాసులు=ఆశ్రమమందు వసించువారు-
సప్తమీ తత్పురుషము.

## సందర్భోచిత వ్యాఖ్యలు

1 మిత్రజన మోదంబును శత్రుజన ఖేదంబునుం గదా సంప దల్లకుం దగియెడు ఫలంబు.

ప్రబంధ పరమేశ్వర బిరుదాంచితుడైన ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన అరణ్య పర్వ పంచమాశ్వాసమునుంచి యుద్ధరింప బడిన ఘోషయాత్ర యను పాఠ్య భాగమునుండి యీ వాక్యము గ్రహింప బడినది.

అరణ్యవాసము చేయుచున్న పాండవులు మిక్కిలి కష్టము లనుభవించుచు ద్వైతవనమందలి యొక సరోవరముచెంత నివసించు చున్నారనియు; తాము సామ్రాజ్య వైభవము ప్రకటమగునట్లు ద్వైతవనమునకుబోయి పాండవులను అపహసించినచో బాగుగా నుండుననియు దుర్యోధనుని ప్రోత్రహించు సందర్భ మున కర్ణుడు పలికిన మాటలివి.

మిత్రులను సంతోషపెట్టుట. శత్రువులను దుఃఖపెట్టుట సంపదలు గల వాడు చేయవలసిన పని. ఆ పని చేయనిచో వాని సంపద నిష్ఫలము. కనుక దుర్యోధనుడు తనవైభవమును పాండవుల యెదుట ప్రదర్శించి వారిని ఏడ్పింప వలయును. ఇట్లని చెప్పి కర్ణుడు దుర్యోధనునకు దుర్బుద్ధి పుట్టించెను.

ఈ వాక్యము కర్ణాదుల దుష్ట నీతికి నిదర్శనముగా నున్నది. తా ననుభ వించుట, మిత్రులకిచ్చుట సంపదలకు ఫలము కావచ్చును. కాని శత్రువులను అవమానించి దుఃఖపెట్టుట సంపదను దుర్వినియోగము చేయుటయే. తేరగ దక్కిన సంపదను ఎట్లు వినియోగింప వలెనో దుర్యోధనాదులకు దెలియదని తాత్పర్యము.

## 2. అభీష్టము చేకురు నెల్ల భంగులన్.

ఈ వాక్యము ప్రబంధ పరమేశ్వర బిరుదాంకితుడైన యెఱ్ఱాప్రెగ్గడ రచించిన అరణ్యపర్వ పంచమాంకము నుండి యుద్ధరింపబడిన "ఘోషయాత్ర" అను పద్య పాఠ్యభాగమునుండి గ్రహింప బడినది.

వనవాస దుఃఖ మనునభవించుచుండిన పాండవులను అవహేళన చేయు టకై ద్వైత వనమునకేగ నిశ్చయించుకొనిన పిదప, అచటి కేగుటకు తగిన యుపాయ మాలోచించి వచ్చి కర్ణుడు దుర్యోధనునితో పల్కినది ఈ వాక్యము.

ద్వైతవనమున మన ఆలమంద లున్నవి. వానిని జూచివత్తుమని చెప్పి నచో ధృతరాష్ట్రు డంగీకరించును. అప్పుడు మన కోరిక తీరును అని కర్ణుడు ఉపాయము చెప్పెను. పాండవులు ద్వైతవనమందున్న సంగతి ధృతరాష్ట్రు డెఱుగును గనుక దుర్యోధనాదులను అచ్చటికి పోనీయడు. ఆలమందలను చూచి వత్తుమని చెప్పినచో అతడంగీకరించునని కర్ణుని ఆలోచన.

అసలు బయలుదేరుచున్నదే చెడుపని కొఱకు. అందుకొరకు ఆలోచించిన యుపాయము అంతకంటె చెడ్డది. పినతండ్రి పుత్రులను పరాభవింపుము అందు కొఱకు తండ్రితో అబద్ధము చెప్పుము- ఇవి కర్ణుడు దుర్యోధనునకుచేసిన బోధలు. ఇట్టి మిత్రులను నమ్ముకొన్నవాడెట్లు బాగుపడును ?

3. ఏ కీడును నేల పొందు నిందు మహీశా ?

ఈ వాక్యము ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన ఆరణ్యపర్వ శేషమందలి పంచమాశ్వాసము నుండి యుద్ధరింపబడిన "ఘోషయాత్ర" అను పద్య పాఠ్యము నుండి గ్రహింపబడినది.

ద్వైతవనమున పాండవులున్నారు గనుక మీరచ్చటికి పోవుట మంచిది కాదు అని పలికిన ధృతరాష్ట్రునితో శకుని యనిన వాక్యమిది.

పాండవుల జోలికి మేమేల పోదుము ? ఒకవేళ మేమేదేని చేసిన ధర్మరాజు సత్యము తప్పునా? తమ్ములను తప్పనిచ్చునా? మాకు గూడ వేటలాడవలెనని యుత్సాహము కలిగినది. గోవుల రక్షణ, వేట వినోదము రెండును తీరును దీని వలన ఏ కీడు మాత్రము ఏల కలుగును ?

వేటలాడినందున వినోదము కలుగును. దుష్టమృగములను జంపినందువల్ల పశువులకు క్షేమము కలుగును. ద్వైతవనమున కేగుటవల్ల ఎట్లుచూచినను లాభమే కలుగునుగాని నష్టము, కష్టము ఎట్లు కలుగును? అని శకుని ఒడుపుగా చెప్పగా ధృతరాష్ట్రుడు తప్పనిసరియై అంగీకరించెను. ఇది కంద పద్య పాదము.

4. ఇది మేటికి జెనటిచెయ్యు లిన్నియు నిచటన్ ?

ఈ వాక్యము ఎఱ్ఱాప్రెగ్గడ రచించిన ఆరణ్యపర్వ శేషమందలి పంచమాశ్వాసము నుండి యుద్ధరింపబడిన "ఘోషయాత్ర" యను పాఠ్యభాగము నుండి స్వీకరింప బడినది.

ద్వైతవన సరోవరతీరమున క్రీడాగృహములు నిర్మింప బూనిన దుర్యోధన భటులను నడ్డగించుచు గంధర్వ భటులుపలికిన వాక్యములలో నిదియొకటి

మహాబలవంతుడైన దుర్యోధనుడు ప్రియకాంతా సహితుడై యీ సరో వరమున క్రీడింప వచ్చుచున్నాడు కనుక మీరిటనుండి తొలగిపొండు అనిన దుర్యోధన భటుల మాటలు విని తమలో తాము నవ్వుకొనుచు గంధర్వ భటు లిట్లనిరి. మీ రాజు మదించి ఎదిరిని,తన్ను ఎఱుగలేకున్నాడు మా రాజుగారి సరో వరమును అక్రమముగా ఆక్రమింప జూచుచున్నాడు. గంధర్వరాజునకు కోపము వచ్చినచో మీ రాజు మానము ప్రాణము భంగపడును. కనుక ఈ చెడ్డచేష్ట లిచ్చట పనికి రావని మీ రాజుతో చెప్పుడు— అని గంధర్వభటులు కౌరవభటు లను, వారి రాజును చులకన చేసి పల్కి వారిని పంపివైచిరి.

ఇది కంద పద్య పాదము.

5. మీకు మాతోడి విద్వేషం బేటికి ?

ప్రబంధపరమేశ్వర, శంభుదాస బిరుదాంచితుడైన యెఱ్ఱాప్రెగ్గడ పూరిం చిన యారణ్య పర్వమందలి పంచమాశ్వాసమునుండి యుద్ధరింపబడిన 'ఘోష యాత్ర' యను పాఠ్యభాగమునుండి ఈ వాక్యము గ్రహింపబడినది.

గంధర్వ భటులు ఈ వాక్యమును దుర్యోధనుని సేనయందలి వీరులతో బలికిరి. ద్వైతవన సమీపమున తాము క్రీడా మందిరములు నిర్మించుచుండ గంధర్వ భటులు తిరస్కరించి పలికిరని భటులు చెప్పగా విని కోపముతో మండిపడి చతురంగ సైన్యములతో బోయి వారి మదము నడంచి రండని దుర్యోధనుడు తన సోదరులను బంపును. గొప్ప సేనతో వచ్చిన వారిని జూచి గంధర్వభటులు ప్రియ పూర్వకముగా మీకు మాతో వైర మేటికి ? అని పలికిరి.

నిష్కారణముగా దండెత్తి వచ్చిన కౌరవుల అవినీతి, అహంకారము, అట్టివారితో ప్రియముగా సంధి వాక్యము లాడిన గంధర్వ భటుల శాంత స్వభా వమును ఈ వాక్యమువల్ల తెలియనగు చున్నది.

6. ఊరకుండ మనల నొందె జయము.

ఈ వాక్యము ఎఱ్ఱాప్రెగ్గడ పూరించిన అరణ్య పర్వమునందలి పంచ మాశ్వాసమునుండి యుద్ధరింప బడిన "ఘోషయాత్ర" అను పద్య పాఠ్యము నుండి గ్రహింప బడినది.

దుర్యోధనుడు గంధర్వులచే బంధితుడు కాగా కౌరవ మంత్రులు, పౌరులు ధర్మజుని శరణు జొచ్చి దుర్యోధనాదులను రక్షింపుమని వేడుకొను చుండగా విని భీముడు పకపక నవ్వుచు ధర్మరాజుతో ఈ వాక్యము పలికెను.

'మనము చేయవలసిన పనిని గంధర్వులే చేసిరి. ఎంత మంచిపని జరిగినది! ఏ కష్టమును లేక ఊరకయుండగానే మనకు జయము లభించినది' భీమునకు దుర్యోధనునకు బాల్యము నుండియు వైరమే- మాయజూదము, ద్రౌపదీ పరాభవము అయిన తర్వాత అది మరింత పెరిగి దుర్యోధనుని ఎప్పుడు చంపుదునా యని భీముడు తహతహలాడు చుండెను. కాని ధర్మరాజు ఆజ్ఞకు బద్ధుడై యూరకుండెను. ఆ దుర్యోధను డిప్పుడు గంధర్వులచే బద్ధుడయ్యెనని విని భీముడు సంతోషించెను. వానిని రక్షింపుడని ధర్మరాజును వేడుచున్న పౌరులను గాంచి వికటముగా నవ్వెను. ధర్మరాజు అందుల కంగీకరింపకుండ చేయుటకై మనకు గావలసిన పని మన ప్రయత్నము లేకుండనే జరిగినది. ఎంత మంచిపనియైనది ? అనుచున్నాడు

"కాగలపని గంధర్వులే తీర్తురు" అన్న సామెత యీ సన్నివేశము నుండియే ఏర్పడి యుండును.

## 7. ఇట్టులైన మనకు గార్యహాని గాదె ?

ప్రబంధ పరమేశ్వర బిరుదాంకితుడైన యెఱ్ఱాప్రెగ్గడ పూరించిన అరణ్య పర్వము; పంచమాశ్వాసమునుండి యుద్ధరింప బడిన 'ఘోషయాత్ర' యను పాఠ్యమునుండి యీ వాక్యము గ్రహింప బడినది.

దుర్యోధనుని చెఱ విడిపించుటకై వెంటనే బయలుదేరి పొండని తమ్ము హెచ్చరించుచున్న ధర్మరాజుతో భీముడు పల్కిన వాక్యమిది.

అరణ్యవాసమున దుఃఖపడుచున్న తమ్ము వెక్కిరించి, యుడికింపవచ్చి తగిన ఫల మనుభవించిన దుర్యోధనునిపట్ల దయజూపవలదని యెంత చెప్పినను వినక వానిని రక్షింపుడు, పొండు అని తమ్ము త్వరపెట్టుచున్న ధర్మరాజుతో దుర్యోధనుడు తమకు మొదటినుండియు చేసిన యపకారములను వరుసగా జెప్పి భీముడు-వానియందు నీవు ఎప్పుడును దయ చూపుచుందువు. అట్లయినచో మన కార్యము చెడిపోవునుగదా. వానిని జయించియో, చంపియో మన రాజ్యమును

తిరిగి సంపాదించుకొనుట మన కర్తవ్యము. గంధర్వులకు జిక్కి నాశనము కానున్న వీనిని రక్షించినచో మన పని వృథాగా చెడిపోవునుగదా—అనెను. గంధర్వులు దుర్యోధనుని చెఱబట్టికొని పోయినచో తమ అర్ధ రాజ్యము తాము తీసికొనవచ్చునని భీముని అభిప్రాయము కావచ్చును. కాని అరణ్యవాసము, అజ్ఞాతవాసము పూర్తిచేసి కాని ధర్మరాజు తమ రాజ్యభాగమును స్వీకరింపడు.

## 8. ఇరవుగ సరిగావు దీని కే ధర్మంబుల్.

ఈ వాక్యము ఎఱ్ఱాప్రెగ్గడ పూర్తిచేసిన ఆరణ్యపర్వమందలి పంచమాశ్వాసమునుండి యుద్ధరింపబడిన "ఘోషయాత్ర" యను పాఠ్యము నుండి గ్రహింపబడినది.

ఈ వాక్యము ధర్మరాజు భీమునితో పలికెను. ద్రోహియైన దుర్యోధనుని గంధర్వుల చెఱనుండి విడిపించుట తగదని పలికిన భీమునితో ధర్మరాజు, ఆపదయందున్న వానిని రక్షించుట మానవధర్మమనియు; అట్టి సందర్భములందు కరుణాపరులైనవారు శత్రు మిత్ర భేదములను గణింపరనియు చెప్పెను.

ఏట్టి భయంకర శత్రువైన శరణని వచ్చినప్పుడు వానిని కాపాడవలయును. ఇది దయాపరులైన వారి పద్ధతి. శరణాగత రక్షణమునకు మించిన ధర్మము వేరేదియు లేదు.

ధర్మరాజుయొక్క అజాతశత్రుత్వము, కరుణాపరత్వము, బంధుప్రీతి, ఆర్తరక్షణ, ధర్మనిరతి, యీ వాక్యమువల్ల దెలియనగుచున్నవి.

ఇది కందపద్యపాదము.

## 9. దుర్జనుం డన్నను సాహస క్రియలందు గడంగి నశించు.

ప్రబంధ పరమేశ్వర, శంభుదాస బిరుదాంచితుడైన యెఱ్ఱాప్రెగ్గడ పూరించిన యారణ్య పర్వశేషమందలి పంచమాశ్వాసమునుండి యుద్ధరింపబడిన "ఘోషయాత్ర" యను పాఠ్యమునుండి ఈ వాక్యము గ్రహింపబడినది.

గంధర్వరాజయిన చిత్రసేనునితో జెప్పి దుర్యోధనుని బంధవిముక్తుని గావించి ధర్మరాజు వానితో బల్కిన హితవాక్యములలో నిది యొకటి.

నీవు గొప్ప సాహసము చేసితివి. దుష్టులెప్పుడును సాహసకార్యము లొనరించుటయందు ఆసక్తి గలిగియుందురు. ఆ కారణమున నాశనము పొందుదురు. నిష్కారణముగా గంధర్వులతో కయ్యమునకుదిగి పరాజయము, పరాభవము పొందితివిగదా! ఇంక నెన్నడును ఇట్టిపనులు చేయకుము అని ధర్మరాజు లోకసామాన్యముగా చెప్పినట్లు చెప్పి దుర్యోధనుని మెత్తగా మందలించెను. ఎదుటివాని మనసు నొచ్చుకొనకుండునట్లు అన్యాపదేశముగా చీవాట్లు పెట్టుట ధర్మరాజు పద్ధతి. తనకు అన్యాయము, అవమానము చేసిన దుర్యోధనునికి సన్మార్గమున సుఖముగా జీవింపుమని హితవుచెప్పి పంపుట ధర్మరాజు శాంతతకు, బంధుప్రీతికి నిదర్శనము.

సందర్భోచితవ్యాఖ్యకు రాదగిన మరికొన్ని వాక్యములు:

1. అభీష్టముఁ జేకుఱు నెల్ల భంగులన్.
2. మీ గమనంబు నామదిఁ బ్రియంబై తోప దెబ్బంగులన్.
3. మదాంధగతిం గవిసె కౌరవానీకముపై.
4. నీ యనుజ వ్రాతము గావవే కరుణ నిండారంగ రాజోత్తమా!
5. తగ విధాతృఁడు చకురుడై నెగడె నేఁడు!
6. వానిదెసం గృప సేయవలదు.
7. మీకు మాయెడన్ విగ్రహమేల ?
8. అన్యులందు నెవ్వరైనను భయ మేమి మాకు ?
9. మీ కారణంబున మా వంశంబునకు నొండొక్క హాని వొందదయ్యె.
10. దీని కొండొక విషాదముఁ బొందకుమీ మనంబునన్.

## ప్రశ్నోత్తరములు

1. అరణ్యవాసము చేయుచున్న పాండవులను పరాభవించుటకు దుర్యోధనాదులు నిశ్చయించుట.

అరణ్యావాసమున పాండవు లనుభవించుచుండిన దుఃఖములను గురించియు, వారి పరాక్రమాదులను గురించియు, వారి వలన కౌరవులకు సంభవింపగల యాపదలను గురించియు ధృతరాష్ట్రుడు పలువిధముల ప్రలాపింపగా విని దుర్యోధనుడు తన తండ్రి బేలతనమునకు విచారపడి శకుని కర్ణులతో గూడి యేకాంత ప్రదేశమున కార్యాలోచనము చేయు సమయమున కర్ణుడు దుర్యోధనునితో నిట్లనెను.

"పరాక్రమవంతులయిన పాండవులు వనములపాలైరి. పూర్వము ధర్మరాజు అధీనమందుండిన ఇంద్రప్రస్థ రాజ్యలక్ష్మి నీ బుద్ధిబలముచేత నీకు వశమైనది. సర్వదిక్కులందలి రాజులును నీకు సామంతులైరి. విశాలమైన భూమండలమంతయు దేవేంద్రవైభవమున పాలింపుము. జానపదులు, పురజనులు నీ యభ్యుదయమే కోరుచున్నారు. కౌరవ సమాజమంతయు నిన్నే సేవించుచున్నది. ఇంక నీవు సూర్యునివలె ఈ ప్రపంచమందెల్ల వెలింగెదవు.

పాండవులు ద్వైతవన సరోవర సమీపమున నున్నట్లు వింటిమి. వనవాస దుఃఖితులైన ఆ పాండవులను నీ సామ్రాజ్య వైభవము ప్రదర్శించి మరింత దుఃఖము కలుగజేయుము. మిత్రులకు ఆనందము, శత్రువులకు దుఃఖము కలిగించుటయే కదా సంపదలకు ఫలము. నారచీరలు ధరించి కందమూలములు భుజించుచు దీనదశయందున్న ఫల్గునునికి మన వైభవము ప్రదర్శించి యాతనిని ఉడికించి వినోదించుట కంటె మనకు కృతార్థత యేమి కలదు? సకల సౌభాగ్యములతో నొప్పుచున్న నీ రాణుల యదృష్టముగాంచి పాండవపత్నియైన ద్రౌపది హృదయము మండిపోవును. ఆమె గర్వ మణగిపోవును."

కర్ణుని సూచనను దుర్యోధనుడు పరమ సంతోషముతో అంగీకరించి యిట్లనెను:—"నా యాలోచనయు నిట్టిదేకాని మనము ద్వైతవనమున కరుగుట ధృతరాష్ట్రున కిష్టముగానుండునని తోచదు. పాండవులు ద్వైతవనమందుండుట ధృతరాష్ట్రుడెఱుంగును గనుక మనము వారితో కలహించుటకే యచ్చటి కేగుచుంటిమని భావించి తప్పక వారించును. పాండవులు మహాపరాక్రమవంతులు, తపస్సంపన్నులని తలంచి వారివలన మనకు అపకారము సంభవింపవచ్చునని ఈ రాజు నిరంతరము భీతిల్లుచుండును. విదురుడు ఎల్లప్పుడు రాజువద్దనే యుండి, పాండవపక్షపాతి యగుటచే మన యభిప్రాయమును

ఏ మాత్రము పసిగట్టినను మన ప్రయాణము సాగనీయడు. కనుక ఇది మిక్కిలి రహస్యముగా సాధింపవలసినపని. నీవును శకునియు తగిన యుపాయ మాలోచించి నిర్ణయింపుడు " ఇట్లనిచెప్పి దుర్యోధనుడు కర్ణశకునులను బంపివైచెను

మరునాడు తెల్లవారినంతనే కర్ణుడు దుర్యోధనుని దర్శించి తనకు దోచిన యుపాయము నిట్లని వివరించెను. "ప్రభూ! ఇప్పుడు మన యాలమందలు ద్వైతవనమందున్నవి. వానిని జూచివచ్చుయను నెపమున మనము ధృతరాష్ట్రుని యంగీకారము సంపాదించవచ్చును."

ఇంతలో శకునివచ్చి "దేవా! నీతోడు. నేనును రాత్రి యీ యుపాయమునే ఆలోచించితిని" అనెను. ముగ్గురును నవ్వుకొనిరి. అనంతరము 'సమంగుడు' అను పేరుగల యొక్క గోపాలకుని బిలిపించి వానికి గొన్ని మాటలునేర్పి, వెంటబెట్టుకొని ముగ్గురును ధృతరాష్ట్రుని దర్శింప బోయిరి. ప్రసంగ వశమున ద్వైతవనమునందలి కీలారమునుండి యొకగోపకుండు వచ్చెనని ధృతరాష్ట్రునకు జెప్పిరి. ధృతరాష్ట్రుడు పశువులు క్షేమముగా నున్నావా? యని ప్రశ్నింపగా ఆ గోపకుడు ఇట్లు విన్నవించెను.

'మహారాజా! పశువులు సుఖముగా నుండుటకు ద్వైతవనము వంటి ప్రదేశము వేరొకటిలేదు. కాని యిటీవల గోసమూహమునకు భయముగలిగించు క్రూరమృగములు పెచ్చు పెరిగి సంచరించుచున్నవి. ఆ వృత్తాంత మంతయు దమకు విన్నవించుటకై నేను కీలారమునుండి త్వరపడి వచ్చితిని.'

గోపకు డిట్లు చెప్పి యూరకున్నంతట కర్ణ శకునులు 'దేవా! అట్లయినచో దుష్టమృగములను సంహరించి గోవులను రక్షించుటకు నీ పుత్రుడైన దుర్యోధనుని నియోగింపుము,' అని ధృతరాష్ట్రుని త్వర పెట్టిరి. కాని ధృతరాష్ట్రుడు వెంటనే అంగీకరింపక కొంత యాలోచించి యిట్లనెను.

'గోవులను రక్షించుట దుష్టమృగములను సంహరించుట అవశ్యము చేయదగినపనులే. అయినను ఆ ద్వైతవనమున ప్రతాపవంతులైన పాండవులిప్పుడు నివసించు చున్నారు కనుక మీరా వనమున కేగుట మేలుగాదో పదుం. అడవులపాలై కృశించి దుర్బలులై యుందురని మీరు తప్పక వారిని బాధింప బూనుదురు. వారు తపోధనులు. పరాక్రమవంతులు. వారికి కోపము వచ్చినచో మిమ్ము తమ అస్త్రబలముచేత ఖండించి వైతురు లేదా తపోబలము చేత

దహించి వైతురు. ఇదివరకే మీచేత అవమానములు పొంది పాండవులు దుఃఖపడుచున్నారు. మిమ్ములను కాంచినంతనే గరుత్మంతునితో సమానుడైన భీమ సేనుడు మండిపడకుండునా?

అంతేకాక రాజసూయ సందర్భమునందు అర్జునుడు తానొక్కడే ప్రపంచ మంతయు జయించెను. ఇటీవల స్వర్గమున కరిగి దేవేంద్రునివద్ద దివ్యాస్త్రములు సంపాదించినాడు. అట్టివానిని యుద్ధరంగమునం దెదిరించుట యెవ్వనికి శక్యమగును? మీవల్ల పాండవులకుగాని. వారివల్ల మీకుగాని యెట్టికీడు సంభవించినను నాకు కష్టముగానుండును. కనుక ఆలమందలను రక్షించుటకు దగిన వారిని ద్వైతవనమునకు బంపుదము. మీరు మాత్రము వెళ్ళవద్దు' అని ధృతరాష్ట్రుడు దుర్యోధనాదుల ఘోషయాత్రకు అంగీకరింపదయ్యెను.

అప్పుడు శకుని యందుకొని ధృతరాష్ట్రుని మనస్సునందలి యనుమానము తొలగిపోవునట్లు చేయుటకై యిట్లనెను- "పాండవులు మహా పరాక్రమ సంపన్నులని మే మెఱుంగమా? అట్టివారికి అప్రియమైనపని మేమేల చేయుదుము? ఒక వేళ మే మేదైన చేసినను, అరణ్యవాసము గావించుటకు ప్రతిజ్ఞ చేసియున్న ధర్మరాజు సత్యమును తప్పడుగదా? ఆతని తమ్ము లాతని మాట నతిక్రమింపరుగదా. కనుక ఎట్టి ప్రమాదమును జరుగదని నీవు గట్టిగా నమ్మవచ్చును. మాకుగూడ వేటలాడవలెనన్న యభిలాష మెండుగా నున్నది. గోరక్షణ మెట్లును చేయదగినదేకదా? కనుక మేము ద్వైతవనమున కేగుట వల్ల ఏ విధముగ చూచినను లాభమే కలుగునుగాని నష్టము కలుగదు.

ఇన్ని విధముల తెలిపి చెప్పగా ధృతరాష్ట్రుడు కొంతవిచారించి తప్పని సరియై "బుద్ధిమంతులై గోరక్షణముగావించి వెంటనే మరలిరండు" అని ఎట్టకేలకు దుర్యోధనాదులు ఘోషయాత్రకుపోవుట కంగీకరించెను. తండ్రి యనుమతి లభించినంతనే దుర్యోధనుడు పరమ సంతోషమున పొంగి హస్తినాపుర మందెల్ల ఘోషయాత్రావిషయమును ఘోషింపజేసెను.

## 2. దుర్యోధనాదులు ఘోషయాత్ర చేయుట.

ద్వైతవనమున కేగుటకు తండ్రియనుమతి లభించినంతనే దుర్యోధనుడు పరమానంద భరితుడయ్యెను. తక్షణమే ఘోషయాత్రను గుఱించి హస్తినా

పురమునందెల్ల ఘోషింపజేసెను. మంచి వస్త్రములు, అలంకారములు, మైపూతలు తాల్చి శోభిల్లురూపము గలవాడై దుర్యోధనుడు తమ్ములు, కర్ణ శకునులు, ఇష్టబంధువులు తమకు యోగ్యములయిన వాహనములతో, సేనలతో గూడినవారై సేవించు చుండగా ఉజ్జ్వలమైన వైభవముతో ఘోషయాత్రకు బయలుదేరెను. పల్లకులు మున్నగు వాహనములపై నెక్కి దుర్యోధనాదుల ప్రియకాంతలు పెక్కు వేలమంది వారివెంట నేగిరి. హస్తినాపుర పౌరులు చక్కగా నలంకరించుకొని తమ ప్రియభార్యలతో గూడి సంతోషముతో వెంబడించిరి. పలువిధములైన బండ్లపై వైశ్యులు, వేశ్యలు బయలుదేరిరి,. ఈ విధముగా ఘోషయాత్ర మిక్కిలి సందడిగా నుండెను.

దుర్యోధన మహారాజువైభవమునకు అనుగుణముగా అతనివెంట ఎనిమిదివేల రథములు, ముప్పదివేల యేనుగులు, తొంబదివేల గుఱ్ఱములు, ఒక లక్ష కాల్బలముగల మహాసైన్యము బయలుదేరెను. నేర్పరులైన వేటకాండ్రు, విటవిదూషక వందిమాగధాదులు పలువురు ఘోషయాత్రలో నుండిరి. ఇట్టి మహాపరివారముతో బయలుదేరి దుర్యోధనుడు గవ్యూతిదూరము ప్రయాణించి యొక ప్రదేశమున విడిదిచేసి యా రాత్రి విశ్రమించెను.

మఱునాడు పెక్కుపర్వతములను, మహారణ్యములను దాటి పోయి ద్వైతవనమున ఆలమందలున్న ప్రదేశమును చేరుకొనెను. పెక్కువేలసంఖ్యలో మందలుగట్టి నిర్భయముగా ఆనందముగా ఆ యరణ్యమునం దేదిక్కున జూచినను గోవులు సందడిగా సంచరించుచుండెను.

మొల్లపూవులు, శంఖములు, కర్పూరపు దండలు, మంచు నురుగు, మంచి గందము, ముత్యాల దండలు, వజ్రములు మున్నగు వానివలె పలుచాయల తెల్ల రంగులు గలవియు, నల్లహంసలు, కారిజము, మేఘమాల, ఇంద్రనీల మణులు మున్నగు వానివలె పలుచాయల నల్లరంగులు గలవియు; పక్వమైన మంకెన చివుళ్ళవలె ఎఱ్ఱనైనవియు; వికసించిన ఉమ్మెత్త, సంపెంగ పూవువలె ప్రకాశించు రంగులు గలవియునైన రంగురంగుల ఆలమందలు కన్నులకింపు గొలుపుచుండెను. దుర్యోధనుడు వానిని దిలకించుచు, వాని లక్షణములను, నామములను, వివరించుచు, దూడలు, గిత్తలు, ఆబోతులు, పాడియావులు, లేగదూడలు మొదలైన పశుభేదములను గోపకులు జూపుచుండగా తిల

కించుచు ఆలమందలలో దిరిగి వినోదించెను. వాని రక్షణకు దగువారిని వినియోగించెను. గోపాలకులు సమర్పించిన క్షీరములను మిత్రులతో గలసి యాస్వాదించి యానందించెను. ఇంతలో విట విదూషక నర్తక గాయకాదులు దర్శింపరాగా వారిని తగువిధమున సత్కరించి పంపివైచెను.

అనంతరము మృగయాకేళికి పూనుకొనెను. లేళ్ళ గుంపులను చీకాకుపరచుచు, మదపుటేనుగులను బంధించుచు, క్రూర సింహములను నరకుచు, అడివి దున్నలు, పెద్దపులులు, అడవిపందులు మున్నగు వానిని బడగొట్టుచు దుర్యోధనాదు లావనమున సంచరించిరి.

తరువాత సుగంధ బంధురములైన కమలములతో నిండిన జలాశయములను దిలకించుచు, మనోహర పుష్పఫల భరితములైన వృక్షములు గల వన ప్రదేశములను ఆలోకించుచు, మయూర శుకపికాదుల మధుర శబ్దముల కోలాహలములను ఆకర్ణించుచు చని చని దుర్యోధనుడు క్రమముగా ద్వైతవనసరోవర ప్రాంతమును జేరుకొనెను. ఆ సరోవర తీరమున ధర్మరాజు ముని జన సమేతుడై సద్యస్కంద మనెడి యాగము గావించుచుండెను. అది చూచి దుర్యోధనుడు ఆ సరోవర తీరమున క్రీడా మందిరములు నిర్మింపుడని తన భటులకాజ్ఞయిచ్చెను. ఆ ప్రదేశమున విడిది చేసి తన వైభవమును బ్రదర్శించి పాండవులను ఉడికింపవలెనని దుర్యోధనుని యాశయము.

## 2. దుర్యోధనుడు గంధర్వులతో కలహించి యుద్ధము చేసి పట్టుబడుట.

ఘోష యాత్ర కరిగిన దుర్యోధనుడు మృగయా వినోదానంతరము ద్వైతవన సరోవర ప్రాంతమున కేగి అచ్చట ధర్మరాజు సద్యస్కందమను యాగమొనర్చుచుండుట యెఱింగి ఆ సరోవర తీరమున క్రీడామందిరములు నిర్మింపుడని తన భటులకు ఆనతిచ్చెను.

కౌరవ భటు లాపని ప్రారంభించి నంతనే కొందఱు గంధర్వులు వచ్చి అది గంధర్వరాజైన చిత్రసేనుని కొఱకు నిర్మింపబడినది కనుక మీరు వెంటనే యిచ్చటి నుండి తొలగిపొండు అని పలికిరి. కౌరవభటులు "మహా పరాక్రమవంతుడైన దుర్యోధన మహారాజు ప్రియకాంతలతో నిందు విహరింప వచ్చుచున్నాడు గనుక మీరు వెంటనే యిటనుండి తొలగి పొండు" అని

మారుపలికిరి. గంధర్వ భటులు ఒకరి మొగ మొకరు చూచుకొని, నవ్వుకొని యిట్లనిరి. "మీ దుర్యోధనుడు తన శక్తిని ఎఱుగ జాలక అహంకరించుచున్నాడు. ఇట్లయినచో అతనికి మాన ప్రాణములు దక్కవు. కనుక యీ దుష్కార్యము నుండి విరమింపుమని మీ రాజుతో జెప్పుడు".

కౌరవభటులు పోయి యీ మాట చెప్పగా దుర్యోధనుడు మండిపడెను. తమ్ములను మహాసైన్యములతో బోయి గంధర్వులకు బుద్ధిచెప్పి యింద్రుడు వచ్చినను లెక్కచేయక యవలీల జయించి సరోవరమును ఆక్రమింపుడు అని ఆజ్ఞాపించెను. వారును గొప్ప చతురంగ బలములతో సింహనాదములు చేయుచు బయలుదేరిరి.

ఇట్లు కౌరవులు పెద్దసేనలతో వచ్చిపడగా గంధర్వభటులు శాంతముగ కలహమువద్దని వారింప యత్నించిరి. కాని కౌరవ వీరులామాటలు లక్ష్యపెట్టక వెంటనే యుద్ధము ప్రారంభించిరి. గంధర్వభటులు వెంటనే యీవార్త గంధర్వ రాజునకు జెప్పగా అతడు కోపోద్దీపితుడై పెక్కువేలమంది గంధర్వవీరులను దుర్మార్గులైన కౌరవులకు బుద్ధిజెప్పి రండని పంపెను.

కుంతలములు, గదలు, కార్ముకములు మున్నగు ఆయుధములు ధరించి ప్రచండ పరాక్రమవంతులైన గంధర్వులు 'కో' యని యఱచుచు వచ్చి కౌరవ సేనను తాకిరి. దుశ్శాసనాది కౌరవులు గంధర్వుల ధాటికి తాళజాలక పరువిడి దుర్యోధనుని మరుగుచొచ్చిరి. కర్ణు డొక్కడే ధైర్యముతో పోరాడుచు గంధర్వుల నడుమ జిక్కుకొని పోయెను. అప్పుడు దుర్యోధనుడు తమ్ములతో గూడి గొప్పసైన్యముతో వచ్చి గంధర్వులపై బడెను. మహా ఘోరమైన యుద్ధము జరిగెను. కొంతసేపు యుద్ధము జరుగగా గంధర్వుల ధైర్యము సన్నగిల్లి చలించిపోయిరి. ఈ వార్త విని గంధర్వరాజైన చిత్రసేనుడు క్రోధోద్రిక్తుడై మదాంధమైన గజేంద్రమువలె యుద్ధరంగమున ప్రవేసించెను.

మాయా యుద్ధ విశారదుడైన చిత్రసేనుడు తన మాయాశక్తిచేత వాయు ప్రసారము, సూర్యకిరణ ప్రసారము ఆగిపోనట్లుచేయగా కౌరవుల సేన యంతయు సర్వనాశనమయ్యెను. ఊపిరి సలుపక, కన్నులు కానరాక చీకాకుపడు చున్న కౌరవసేనను గంధర్వులు పొదివి నరికి ప్రోగులు పెట్టిరి. గంధర్వుల ప్రతాపమునకు తాళజాలక కౌరవసేనలు చెదరి ధర్మరాజున్న దిక్కునకు

జారిపోయెను. కర్ణుడొక్కడు మాత్రము పర్వతమువలె నిలిచి పోరాడుచుండెను దుశ్శాసనాదులతో గలిసి దుర్యోధనుడును కర్ణునకు తోడ్పడుచుండెను. ఇంతలో గంధర్వులు అశ్వములను, సారథిని, చంపి, వింటిని చక్రములను నరికివేయగా కర్ణుడు విరథుడై వికర్ణుని రథమెక్కి యుద్ధభూమినుండి తొలగిపోయెను.

దుర్యోధనుడు ధైర్యముతో పోరాడుచునే యుండెను. అది చూచి చిత్రసేనుడు కోపించి యాతని నెదుర్కొని రథము భగ్నము చేయించెను విరథుడైన దుర్యోధనుని జుట్టుపట్టి క్రిందికీడ్చి చేతులు వెనుకకు విఱిచి కట్టించెను. తక్కిన గంధర్వులు అతని ప్రియకాంతలను, దుశ్శాసనాదులను బంధించిరి. అట్టిస్థితిలో తక్కిన కౌరవులును, పౌరులును, మంత్రులును భీతులై యాక్రోశించుచు ధర్మపుత్రుని శరణు జొచ్చి యిట్లని మొఱపెట్టిరి.

"మహాపరాక్రమవంతులైన గంధర్వవీరులు సుయోధనుని, వాని తమ్ములను, ప్రియకాంతలను బంధించి కొనిపోవుచున్నారు ఆ గంధర్వులను ఓడించి నీ తమ్ములను రక్షింపుము"

### 4. దుర్యోధనుని రక్షించుటకై ధర్మరాజు తన తమ్ములను ప్రోత్సహించి పంపుట.

గంధర్వులు కౌరవసేనను భగ్నము గావించి దుర్యోధనాదులను చెఱబట్టి కొని పోవుచుండగా తక్కిన కౌరవులు, పౌరులు, అమాత్యులు ధర్మరాజు శరణుజొచ్చి దుర్యోధనుని రక్షింపుమని దీనముగా మొఱపెట్టుకొనిరి. భీముడు వారి ఆక్రందనములు విని పకపకనవ్వుచు ధర్మరాజుతో నిట్లనెను.

"మనపని తేలికైనది. మనము చేయవలసిన దానిని గంధర్వులే చేసిరి. ఎంత మంచిపని జరిగినది! ఏ శ్రమయు లేకుండ మనకు జయము లభించినది. పుట్టుకచేతనే కపటియై పెక్కు పాపకార్యము లొనర్చి లోకులచే తిట్లుపడిన దుష్టునకు తగిన శిక్ష విధించి విధాత నేడు నేర్పరి యనిపించుకొనినాడు. అదృష్టము తలక్రిందులై యడవులందు వసించుచు దీనులైయున్నారని తలంచి వీడు గర్వాంధుడై మనల నవమానింప వచ్చెను. సబంధుపరివారుడై తన గర్వమునకు దగినఫల మనుభవించినాడు. వానిపట్ల నీవు దయచూపవద్దు"

ఈ విధముగా పలికిన భీమసేను నుద్దేశించి ధర్మరాజిట్లనెను. "అక్కటా యిది పరుషవాక్యములకు సమయమా ? శరణుచొచ్చి దీనులైయున్న కౌరవులను కనికరించుట నీకు యుక్తముకాదా ! ఒకే వంశమున బుట్టినవారికి ఆస్తికారణముగా నొకొక్కప్పుడు వైరము కలుగుచుండును. అంతమాత్రమున బంధుత్వము తప్పరాదు. దాయాదులు తమలో నెట్లు కలహించుకొన్నను ఇతరులవల్ల పరాభవము కలిగినప్పుడు పరస్పరము తోడ్పడకుండినచో లోకులు నిందింతురు. దుర్యోధనుడు దుష్టుడేయైనను భార్యలతో గలసి పట్టుబడెనుగదా! ఇట్టిస్థితిలో మనము కల్పించుకొనకుండినచో మన వంశమునకు, కీర్తికి నష్టము కలుగదా ? ఇంతేకాక శరణాగతులను రక్షించుట క్షత్రియ మాత్రునకు ధర్మము. నీవంటి బాహుబలసంపన్నుడైన యుత్తమ క్షత్రియుల సంగతి చెప్పనేల? లెమ్ము. నీవును నీ సోదరులును రథము లెక్కి సర్వాయుధములతో బోయి దుర్యోధనుని చెఱలు విడిపింపుడు"

ధర్మరాజు ఇన్నివిధముల జెప్పినకు భీమునకు నచ్చలేదు. అతడు మరల ధర్మరాజుతో నిట్లనెను :

"లేశమైన శంకలేక మనపై అలిగి వీడు నన్ను జలముల ద్రోయించెను. నాకు విషము పెట్టించెను. మనల నందఱను లక్కయింట దగులబెట్ట యత్నించెను. మాయజూదమున నిన్ను వంచించి మన యైశ్వర్యమంతయు నపహరించెను. నిండుసభలో ద్రౌపది తలపట్టి ఈడ్పించి వివస్త్రనుగావింప జూచెను. పుట్టిననాటనుండి వీడు మనకు ఎగ్గుచేయని దినము కలదా? వాడు చేసిన యపకారము ఒక్కటియు నీవు తలంపకున్నావు. పైగా ఎల్లప్పుడు వాని యందు దయచూపుచునే యుందువు ఇట్లయినచో మనకు కార్యహాని కాదా!"

అని పూర్వవైరమును స్మరించుచు కోపించి పలికిన భీమునితో అజాతశత్రుడైన ధర్మరాజు శాంతముగా మరల నిట్లనెను :

"రక్షింపుమని ప్రార్థించినప్పుడు ఎంతటి బలహీనుడైనను తనకు చేతనైనంత చేయును, అట్టిచో నీవంటి యుత్తమశూరుడు దీనజనుల యవస్థగాంచి యూరకుండునా? శరణు అని వచ్చినప్పుడు ఎంతటి ఘోర శత్రువునైనను రక్షింపవలయును. ఇది కరుణాపరుల పద్ధతి. దీనికి ఏ ధర్మములును సాటిరావు బలపరాక్రమములు దుర్యోధను డెఱుగును. కనుకనే తన్ను తప్పక విడిపింతు

రని మనపై గట్టియాస పెట్టుకొని యుండును. మనకు ఇది పుణ్యము, కీర్తి సంపాదించు తరుణము. నిన్నింత నిర్బంధింపక నేనే పోయి వానిని రక్షించి యుందును. కాని యిప్పుడు యాగదీక్షలో నుండుటచే నేనువెళ్లుటకు వీలులేదు; మీరు వెంటనేపోయి ప్రియవచనములతో గంధర్వులను శాంతపఱచి దుర్యోధనుని చెఱవిడిపింపుడు. సామవచనములతో కార్యము తీరకున్నచో శత్రువులను ఓడించియైనను పనిపూర్తిచేయుడు. నేను చేయుచున్న యాగము సఫలము చేయుడు.

ధర్మరాజు ఇన్నివిధముల తఱచి చెప్పగా భీముడు ఎట్టకేలకు అంగీకరించెను. ధర్మరాజు పనుపున దుర్యోధనుని విడిపించుకొని వచ్చుటకు అర్జునుడును ప్రతిజ్ఞ చేసెను. నకుల సహదేవులను ఉత్సాహవంతులైరి. అంతట నలుగురును సర్వాయుధసన్నద్ధులై రథములెక్కి యతిత్వరితగతిం జనిరి. కౌరవ సైన్యముకూడ వారివెంట బయలుదేరెను.

## 5. పాండవులు గంధర్వుల నోడించి ధుర్యోధనాదులను విడిపించుట.

ధర్మజుని ప్రేరణచే భీమాదులు సర్వాయుధసన్నద్ధులై దుర్యోధనుని విడిపించుటకై రథము లెక్కి బయలుదేరిరి. చెదరిన కౌరవసేనలును వారికి తోడుగా బయలుదేరెను. ఈ విధముగా నరిగి గంధమాదన పర్వతము దిక్కున కేగుచున్న గంధర్వసేనను వెనుకనుండి తాకగా గంధర్వులును వెనుదిరిగి నిల్చిరి. అగ్నిసమానులు, తేజోధనులునైన పాండవులంగాంచి గంధర్వులు గొప్ప యాటోపముతో యుద్ధమునకు సిద్ధపడిరి.

అర్జునుడు ధర్మజుని యుపదేశమును స్మరించి, శాంతముగా, ప్రియ వచనములతో ఆ గంధర్వుల కిట్లనెను. "మీకు మాతో వైరమేల? స్నేహభావముతో ఈ కురురాజును విడువుడు, ఇది రాజాగ్రేసరుడైన ధర్మజుని యాజ్ఞ ఎల్లరకు అలంఘ్యము" ఆ మాటకు గధర్వులిట్లనిరి- ధర్మరాజు మాకు ప్రభువా? ఆయన యాజ్ఞను మేమేల పాటింతుము? దేవేంద్రుడొక్కడే మమ్ము అజ్ఞాపింపగల ప్రభువు ఇతరులెవ్వరయినను మాకు లెక్కలేదు."

ఇట్లు తమ్ము తిరస్కరించి పలికిన గంధర్వులతో పార్థుడు "ముందే సాహసమునకు దిగనేల యని ప్రేమపూర్వకముగా ధర్మము తెలిపితిని. మీరు

చూడగా సామమునకు లొంగునట్లులేదు. కనుక ఉగ్రమైన సమరము గావించి దుర్యోధనుని విడిపింతును "అని గంధర్వులపై బాణపరంపర ప్రయోగించెను. వారును బాణవర్షము కురిపించిరి. అనేక శతసహస్ర సంఖ్యగల గంధర్వులకు, పాండవులు నలుగురకు అంతట మహాఘోర సంగ్రామము జరిగెను.

గంధర్వులనేకులు చుట్టుముట్టి యర్జునుని రథమును భగ్నము చేయ జూచిరి కాని ఆతడు దివ్యబాణ వర్షములు కురిపించి అగ్నిసమానులైన గంధర్వులను పదిలక్షల మందిని దహించివైచెను. తమ కోదండముల యల్లె తాళ్ళవలన బుట్టిన టంకారములు భూమ్యాకాశములను వ్యాపించుచుండగా నకుల సహదేవులును భీముడును తీవ్రములైన బాణములను ఎడతెగక ప్రయోగించుచు గంధర్వ వీరులను తునుమాడగా గంధర్వుల రక్తములు యుద్ధరంగమున మడువులు గట్టెను.

పాండవు లిట్లు పీడించుచున్నను గంధర్వులు దుర్యోధనాదుల చెఱలు విడువక ఆకాశమున కెగిరి తప్పించుకొనిపోవ యత్నింపగా అర్జును డది కని పెట్టి రెండు చేతులతో అతివేగముగా బాణములు ప్రయోగించి అన్ని దిక్కులను బంధించెను. గంధర్వులు వలలో జిక్కిన పులుగులవలె ఆ శరపంజరమున జిక్కిరి. ఐనను ధైర్యము వీడక పాండవుల మీద వివిధాయుధ పరంపరలు ప్రయోగించు చుండిరి.

అర్జునుడు గంధర్వులు ప్రయోగించు బాణములన్నియు ఖండించి క్రోధావేశముతో వాడియైన బాణములను పుంఖానుపుంసములుగా ప్రయోగింపగా గంధర్వుల శిరములుతెగి మొండెములు నేలపై గూలసాగెను. వారి రక్తములు రణరంగమున ప్రవాహములు కట్టెను. పలువురు గంధర్వులు చచ్చుటచే అకాశమున వారి సందడి యడగి పోయెను. మఱియు అర్జునుడు ప్రయోగించిన యాగ్నేయాస్త్రము దావాగ్ని యెండుటడవిని దహించినట్లు గంధర్వ సేనను దహించివైచెను. అప్పుడు గంధర్వరాజైన చిత్రసేనుడు మహా రోషముతో తీవ్రమైన గదా దండమును అర్జునునిపై ప్రయోగించెను. అర్జునుడు దానిని ఏడు ముక్కలుగా నరికివైచెను. గంధర్వరాజంతట తనమాయా శక్తిచే అంతర్హితుడై మేఘమువలె గర్జించుచు నల్వురు పాండవులపై మండుచున్న బాణముల వర్షము కురిపించెను. అర్జును డది లక్ష్యపెట్టక శబ్దవేధులైన బాణములు ప్రయోగించి చిత్రసేనుని శరీరమంతయు తూట్లుపడునట్లు చేసెను.

అంతట చిత్రసేను డింకచేయునది లేక రణసంరంభమువిడిచి పార్థుని యెదుట నిల్చెను. అర్జునుడును తన పూర్వ సఖుడగు చిత్రసేనుని గుర్తించి బాణప్రయోగము మానెను. భీమాదులును యుద్ధము విరమించిరి. కుశల ప్రశ్నము లయిన పిమ్మట అర్జునుడు చిత్రసేనున కిట్లనెను.

"వీరోత్తమా! ఈ కౌరవులతో నిట్లు వైరము పూనుట నీకు తగునా? సపరివారముగా ఈకురురాజును విడిచిపుచ్చుము" అనిన గంధర్వరాజు పార్థున కిట్లనెను. "భార్యాసహితులైన యరణ్యములందు ఇడుమల పడుచున్న మిమ్ము పరిహసింప వలెనని యీదురాత్ముడు వైభవసమన్వితుడై యిచ్చటికివచ్చెను. ఇదియంతయు నెఱింగి యింద్రుడు కోపించి యీ పాపాత్ముని అనుజ వధూ సహితముగ బంధించి తెమ్మని యాజ్ఞాపింపగా వచ్చితిని. కనుకనే వీనినిపట్టు కొని పోవుచున్నాను. నీ వింక వేరు పలుకవద్దు. నీవు నాకు సఖుడవుగాన నీ పట్ల నాకు కోపముగాని యీర్ష్యగాని లేదు."

గంధర్వరాజు మాటలు విని యర్జునుడు మరల నిట్లనెను. "ఈ దుర్యోధనుడు మాకు సోదరుడుగదా. కనుక వీనిని బంధించి కొనిపోవుట కంటె విడిచి పుచ్చుటయే ధర్మరాజునకు ప్రియము గలిగించును. దేవేంద్రుని యాజ్ఞయైనను, మఱియెవ్వరి యాజ్ఞయైనను గానిమ్ము. నీవు మాత్రము ముందుగా ధర్మజుని సమక్షమునకు వచ్చి విషయమంతయు ఆయనకు నివేదించి ఆయన యెట్లుచెప్పిన నట్లుచేయుము. నా సంతోషము కొఱకు నీవు మా వెంట ధర్మజుని కడకు రమ్ము."

పార్థుని మాటల కంగీకరించి గంధర్వరాజు ధర్మరాజును దర్శింప బోయెను.

### 6. ధర్మరాజు శీలము.

**ధీరోదాత్తుడు—నిత్యతృప్తుడు—బంధుప్రియుడు—**
**అజాతశత్రువు—కరుణామయుడు—కులరక్షకుడు—**
**కీర్తిప్రియుడు—వాక్యచతురుడు—రాజనీతి నిపుణుడు—**
**దూరదర్శి—మహాప్రభువు**

ధర్మరాజు గంభీరమయిన స్వభావము గలవాడు. ఐశ్వర్యమంతయు గోల్పోయి యరణ్యముల పాలయ్యెను ఆయన దైన్యము పొందలేదు. సమయ పాలనము గావించి మరల రాజ్యవైభవముల ననుభవింతుమన్న ధైర్యముతో ఆయన నిశ్చలుడయి వనవాస వ్రతము నడుపుచుండెను. కౌరవులు తమకు గావించిన యపకారములను స్మరించుచు వారి పట్ల క్రోధోద్వేగము పొందుట ఆయన యెఱుగడు.

అరణ్యమునం దున్నను ఆయన రాజ్యము నందున్నట్లే పరమసంతుష్టుడయి యుండెను. వనమున లభించు కందమూలములే సాధనములుగా ఏవేవో యాగములు చేయుచ నిరంతరము మునిజనులతో ధర్మగోష్ఠి జరుపుచు ఆయన సంతృప్తుడయి యుండెను రాజ్యవైభవములకు దూరమయితి నన్న చింత ఆయన చిత్తమునం దున్నట్లు కనబడదు.

కౌరవులను గంధర్వులు బంధించుకొని పోవుచుండిరని యాయన మిగుల జాలి పడెను. మంచిపని జరిగినదని నవ్వుచు బలికిన భీముని గాంచి "అకటా! ఇది పరుషవాక్యములకు సమయమే"? అని యాయన విచారపడెను. దుష్టుడయినను భార్యా సహితుడయి పట్టుబడిన దుర్యోధనుని విడిపింప దివిరి నాడు. అర్థనిమిత్తమున దాయాదులతో కలహములు పుట్టుట సహజ మనియు అంతమాత్రమున బంధుప్రీతి విడుచుట దోషమనియు ఆయన విశ్వాసము. అందువలన రాజ్యము కారణముగా దుర్యోధనుడు తమకు గావించిన యపకారములను ఆయన అంతగా పట్టించుకొనలేదు.

ధర్మరాజు అజాతశత్రువు అను సార్థకమయిన బిరుదము గలవాడు. ఆయన నెవ్వరయిన శత్రువుగ భావింపవచ్చును. కాని ఆయన మాత్రము ఎవ్వరిని తనకు శత్రువుగా భావింపడు. రాజ్యమును కపట మార్గమున అపహరించుటయేకాక నిండుసభలో తమ భార్యను పరాభవించిన దుర్యోధనుని యందు కూడ ఆయనకు శత్రుభావములేదు దుర్యోధనుడు అవినీతుడు గనక ఆవిధముగా ప్రవర్తించుచున్నాడని ఆయనకు వానియందు జాలి. తమ్ము అవమానించవచ్చి గంధర్వులచే పరాభూతుడయినట్లు వినికూడ ఆయన దుర్యోధనునిపట్ల ద్వేషము పొందలేదు. జాలిపడి బంధు ప్రీతిచే వానిని విడిపించుటకే పూనుకొనెను.

ధర్మరాజు మృదుహృదయుడు. పరుషమైన భావము, వాక్కు ఆయన యెఱుగడు. దుర్యోధనుడు ఎంత దుష్టుడైనను, తమకెట్టి ద్రోహములు చేసినను వానిపట్ల 'కేవలంపు కరుణ పూని' యుండువాడు. అహింస ఆయనకు పరమ ధర్మము. భీకరశత్రువునైనను శరణని వచ్చినప్పుడు కాపాడుట ఆయన స్వభావము. అది కరుణాపరుల తెఱగని దానిని మించిన ధర్మమేదియు లేదనియు ఆయన విశ్వాసము. తన భార్యను దుర్యోధనుడు నిండు సభలో పరాభవించినను. గంధర్వులాతని భార్యలను గూడ చెఱపట్టిరని విన్నప్పుడు ధర్మరాజు మిక్కిలి జాలిపడెను.

తన సుఖముకంటె, లాభముకంటె ధర్మరాజునకు వంశ ప్రతిష్ఠయందు ఆసక్తి మెండు. గంధర్వులు దుర్యోధనుని బంధించి కొనిపోవుట ఆయనకు ఎంతో అవమానకర మనిపించెను. దుర్యోధనుడు తనవాడు. వానిని అవమానించుట తన్నవమానించుటయే. గంధర్వులు చేసినపని తనకుల ప్రతిష్ఠకే భంగకరము. గంధర్వులు దుర్యోధనుని వధింప నందులకును ఆయన ఎంతో సంతోషించి. చిత్రసేనుని "మహాత్మా! వీడు మీచే వధింపబడుటకునికి మేలయ్యె!" అని సగౌరవముగా సంబోధించి యభినందించెను వీనిని విడిచి మా వంశ మర్యాదను కాపాడుమని ప్రార్థించెను.

ధర్మరాజునకు కీర్తి ప్రీతి మెండు. కీర్తివలన స్వర్గము లభించునన్న మాటయం దాయనకు గాఢమైన విశ్వాసము. తమకు పెక్కువిధముల అపకారములు కావించిన దుర్యోధనుడు శత్రువులకు జిక్కినప్పుడు వానిని విడిపించుట కీర్తికరమని ఆయన యెఱుంగును. ఈ రహస్యము నెఱుంగని భీమునకు కీర్తి యొక్క, పుణ్యము యొక్క ప్రాధాన్యము సూచించు అవకాశము లభించినప్పుడు వానిని దక్కించుకొనుట వివేకము అని ధర్మజుడు బోధించెను.

ధర్మరాజు మృదువుగా మాట్లాడుటయేకాక మిక్కిలి చతురముగాకూడ మాట్లాడును, ఆయన వాక్యములు తరచు ప్రశ్నల రూపమున నుండును. కాని అవి ప్రశ్నలుకావు. దేనినైన సుకుమారముగ నిషేధింప దలచినప్పుడు ఆయన ఆయంశమును ప్రశ్నార్థక వాక్యమున ప్రతిపాదించును. వినువానికి నిషేధము బోధపడుచునే యుండును. "ఇది పరుష వాక్యములకు సమయమె? కౌరవ నికరమునకు గరుణసేయ నీకుం దగదే!" ఒకనికి బుద్ధి చెప్పునప్పుడు

గూడ ధర్మరాజు సూటిగా చెప్పక అన్యాపదేశముగా లోకసామాన్యముగా చెప్పినట్లు చెప్పును. "దుర్జనుం డన్నన సాహస క్రియలయందు గడంగి నశించు"- అని దుర్యోధనుని మందలించుట. ఓడిన వానిని గూడ ధర్మరాజు సగౌరవముగ సంబోధించును. చిత్రసేనుని 'మహాత్మా:' అనుట. మాకుంగా వీనిని విడువుము అని ప్రార్థించుట. ఇతరుల మనస్సులు నొచ్చుకొనకుండు నంత చతురముగా ఆయన మాట్లాడును.

దుర్యోధనాదులు గంధర్వులకు ఓడి పట్టుబడిరని విని భీముడు తమపని తీరినదని సంతోషించెను. రాజ్యమును తామింక అనుభవింప వచ్చుననియే ఆతని తలంపు. కాని అరణ్యవాసము, అజ్ఞాతవాసము పూర్తిచేసిన పిదపగాని తాము రాజ్యమును గ్రహింపరాదని ధర్మజునకు దెలియును. కనుక గంధర్వుల నుండి దుర్యోధనుని విడిపించినచో వాడు హృదయపరివర్తనము పొంది యరణ్య వాసకాలమున తమ్ము పీడించుటకు, అజ్ఞాతవాసమును భంగము చేయుటకు యత్నింపడని ధర్మజుని ఆశ. తన్ను ఓడించిన గంధర్వులను పాండవులు స్వశక్తిచే జయించుట కళ్ళార చూచినచో దుర్యోధనుడు సమయపాలానంత రము తమ రాజ్యమును తమకు ఇచ్చివేయునని ఆయన యాశయము. ఓడిన గంధర్వరాజును గౌరవించి పంపినచో ఇంద్రునకు తృప్తిగా నుండునని ఆయన యభిప్రాయము. ఆయన సామమార్గావలంబన మంతయు రాజనీతియే. యుద్ధ ముతో పనిలేకుండ తనపని నెరవేర్చుకొనుట ఆయన ఆశయము.

దుర్యోధనుడు, వాని బంధువులే కాక ఘోషయాత్రా వినోదము కొరకు వచ్చిన పౌరులందరు గంధర్వులవల్ల భంగపడిరి. పౌరులువచ్చి తన్ను శరణు జొచ్చిరి. అట్టిస్థితియందు దుర్యోధనాదులను విడిపించినచో పౌరులు తమ ధార్మికతను మెత్తురు. దుర్యోధనుని దుర్జనత్వము, తమ సుజనత్వము వారికి ప్రత్యక్షముగా దెలిసివచ్చును. సమయపాలానంతరము దుర్యోధనుడు తమకు రాజ్యభాగ మీయ నిష్టపడనిచో ఈ పౌరులెల్లరు తమ పక్షము వహింతురు. కనుక పౌరులను, వారి ప్రార్థనపై దుర్యోధనాదులను రక్షించుట ధర్మరాజు దూరదృష్టికి నిదర్శనము.

ఎట్టి తీవ్రస్వభావము గలవారినైనను, తనశాంత స్వభావముచే, వాక్చాతు ర్యముచే, ధార్మికతచే ధర్మరాజు వశపరచుకొనగల సమర్థుడు. తమ్ములమీద ఆయనచేయు ప్రభుత్వము ఆశ్చర్యకరమైనది. దుర్యోధనుడు గంధర్వులకు

పట్టుబడెనన్న మాట విని ముందు సంతోషము వెలిబుచ్చినవాడు భీముడు. దుర్యోధనుని బంధవిముక్తుని గావించుటకు ధర్మరాజు భీమునే పొమ్మనుట అందులకే భీముడు ఎన్ని చెప్పినను అన్నింటికి అన్ని సమాధానములు చెప్పి ధర్మరాజు భీముని సమ్మతింప జేయవలెనని పట్టుపట్టెను. భీముడు సుముఖముగా లేనప్పుడు అర్జునుని పొమ్మనవచ్చును. కాని ఆయన మార్గ మదికాదు. భీముడే బయలుదేరవలయును. తక్కిన తమ్ములు వానికి తోడు పోవలయును. భీముడెంతకును అంగీకరింపక పోగా. "నేనే పోదును. నిన్ను బలవంతము చేయవలసిన పనియే లేదు. కాని నేను యజ్ఞదీక్షితుడను గనుక నాకు పోరాదు" అని ధర్మరాజు భీమునకు నిర్బంధమే కలిగించెను. "నా యాగము సఫలము చేయుడు" అని. అది శత్రు రక్షణ కాదు. నా యాగరక్షణ అని చెప్పి భీముడు బయలుదేరక తప్పనిస్థితి కల్పించెను. తన నేర్పుతో ఆయన తన ప్రభుత్వమును చెల్లించు కొనుచు తమ్ములను ధర్మమార్గమున నడిపించును.

## 7. దుర్యోధనుని శీలము.

దుర్యోధనుడు విదురాది సత్పురుషుల వద్ద నీతులు నేర్వలేదు. కణికుడు అను కుటిలుని వద్ద నీతులు నేర్చెను. వానికి అవి రుచించెను మిత్ర జనులకు మోదమును, శత్రుజనులకు ఖేదమును కలిగించుట ఐశ్వర్యమునకు సాఫల్యము అనుట ఆ నీతులలో నొకటి. ఇట్టి నీతిని ప్రయోగించుట యందు అతనికి ఉపాయములు చెప్పువారు కర్ణుడు శకుని.

దుర్నీతులను ప్రయోగించుపట్ల కపటము నవలంబింపక తప్పదు. వనవాసమున వందురుచున్న పాండవుల యెదుట తన వైభవమును ప్రదర్శించి వారిని ఉడికింపవలెనన్న యాలోచన కలిగినప్పుడు ఆ పని చేయుటకు కపట మార్గము తప్పనిసరి యయ్యెను. ద్వైతవనమున కరుగుటకు తండ్రి యనుమతింపడు. కనుక ఘోషయాత్ర యను నెపము అవసరమయ్యెను. ఘోషయాత్ర యవసరమని తండ్రికి నచ్చజెప్పుటకు ఆలమందలకు క్రూరమృగ బాధలు కల్పింప వలసి వచ్చెను. ఇందుకొఱకు సమంగునకు అసత్యములు నేర్పి తండ్రిని మోసగింపవలసి వచ్చెను.

దుర్యోధనుడు దురహంకారి. వనవాసమున నుండియు పాండవులు తపశ్శక్తిని, దివ్యాస్త్రములను సంపాదించి బలవత్తరు లగుచున్నారే కాని దుర్బలు

శత్రు పాండవులను అవమానించు తలంపు వీడలేదు. తండ్రి వట్టి పిరికివాడని వాని యభిప్రాయము. ద్వైతవనమున కరిగి పాండవులను ఉడికింప బోయి గంధర్వులతో కలహము పెట్టుకొనుట వాని బల గర్వమునకు గుర్తు. గంధర్వులు దివ్యులనియు మాయాశక్తి గలవారనియు, నాత డెఱుంగడా ? ఐనను తన రాజ్యములోని ద్వైతవనము నందు గల సరోవరమున దాను క్రీడింపబోగా అడ్డగించుటకు ఈ గంధర్వుల లెవ్వరు ? అని యహంకారము. ధర్మరాజు ప్రశాంతముగా యాగము చేసికొనుచున్న సరోవరము దగ్గరనే తాను ఆటపాటలతో విడిది చేయవలయును. దానికి అడ్డము వచ్చినచో దేవేంద్రుడైన ఎదిరింపవలసినదే.

దుర్యోధనుడు మహాసాహసి. ఒకపని చేయవలెనని బుద్ధికి దోచినచో నింక వెనుక ముందులు చూడడు. దానివల్ల రాబోవు ప్రమాదములను గణింపడు. కళ్ళు మూసికొని దూకును. మహా బలపరాక్రమ సంపన్నులే కాక, తపశ్శక్తి, దివ్యాస్త్రసంపద గల పాండవులను అవమానింప దలచుటయే సాహసము. వారిచే తాను ద్రౌపదీ స్వయంవర సమరమున నోడింపబడెను. దిగ్విజయము గావించిన వారిశక్తి తనకు దెలియును. అట్టి వారిని అపహసింపబోవుటయే కాక, మాయా యుద్ధ విశారదులైన గంధర్వులతో యుద్ధమునకు దిగుట మితిలేని సాహసము.

దుర్యోధనునకు ప్రాణము కంటె మానము ప్రియతరము. తల పెట్టిన పని యెట్టిదైనను సాధింప బూనునే కాని వెనుతీయడు. గంధర్వుల బలము రుచి చూచియు వాడు యుద్ధమున దిగుటకు అభిమానము కారణము. పట్టుబడిన తన్ను పాండవులు విడిపింపగా హృదయ పరివర్తనము చెంది వారితో మైత్రి పాటింపకపోవుట, గంధర్వులు చెఱపట్టిన దానికంటె పాండవులు చెఱ విడిపించుటయే తనకు అవమానకరమని భావించుట వాని దురభిమానమునకు గుర్తు. అట్టి స్థితికి పాల్పడవలసి వచ్చినప్పుడు బ్రతుకుట కంటె ప్రాయోపవేశము పూని ప్రాణములు విడుచుటయే మేలని నిశ్చయించుట వాని మానధనత్వమునకు

---